వార్త

# ఆదివారం

12 ఫిబ్రవరి 2017



# గోడలు.. గొడవలు

## అడ్డుగోడల వెనుక ఆంతర్యాలు..

## కోలీవుడ్ ఆదరణ

బాహుబలి తర్వాత తమన్నా దశ తిరిగిపోతుందని అంతా అనుకున్నారు.. కానీ అంత పెద్ద బ్లాక్ బస్టర్‌లో నటించినా .. ఆ తర్వాత బెంగాల్ టైగర్.. ఊపిరి లాంటి సక్సెస్‌ఫుల్ సినిమాల్లో నటించినా.. తెలుగులో ఆమె కెరీర్ ఊపందుకోలేదు సరికదా.. ఇంకా డల్ అయ్యింది. ఊపిరి తర్వాత తెలుగులో తమన్నా ఒక్కటంటే ఒక్క డైరెక్టు మూవీ కూడా చేయలేకపోవటం విడ్డూరమే అంటున్నారు. టాలీవుడ్ స్టార్ హీరోలందరూ ఆమెకు టాటా చెప్పేశారు. మీడియం రేంజ్ సినిమాలకు కూడ ఆవిడ దూరంగానే ఉంటోంది. అయితే అదే సమయంలో తమిళ ఇండస్ట్రీ మాత్రం ఆమెను బాగానే ఆదరిస్తోంది.. కెరీర్ ఆరంభంలో తెలుగు ప్రేక్షకులు తిరస్కరించాక తమిళ జనాలే ఆమెను నెత్తిన పెట్టుకున్నారు. ఇపుడు తెలుగులో మరోసారి అవకాశాల్లేక ఇబ్బంది పడుతున్న సమయంలో మళ్లీ కోలీవుడ్ ఆమెను ఆదుకుంటోంది. గత ఏడాది కోలీవుడ్‌లో ధర్మదురై దేవి, (అభినేత్రి), కత్తి సెండై లాంటి సినిమాల్లో నటించింది. తమన్నా.. ఈ ఏడాది కూడ వరుసగా అవకాశాలు తమ్మూ తలుపు తడుతున్నాయి..



## అమ్మడు గ్రేటే



టాలీవుడ్‌లో అందగత్తెలకు ఏమాత్రం కొదవ లేకపోయినా అనుష్క అందగత్తె మాత్రం అదుర్స్.. హైట్.. వెయిట్‌లో ఎక్కడా రేషియో తేడా లేకుండా సూపర్బ్‌గా ఉండే ఈ సుందరి సినిమాల్లో కన్పించటం తగ్గించేసింది.. చేసేవన్నీ పెద్ద పెద్ద ప్రాజెక్టులే కావటంతో తక్కువగా సినిమాలు వస్తున్నాయి.. దీంతో అమ్మడు ఎక్కడా పెద్దగా కన్పించటం లేదు. రీసెంట్‌గా ఆమెను చూసిన సినీజనం మాత్రం అనుష్క మళ్లీ వెయిట్ పెరిగిందని .. సింగం3 ట్రైలర్‌లోనూ అనుష్క హెవీగానే కన్పించిందని అంటున్నారు. ప్రస్తుతం అనుష్క నటించిన సింగం 3, బాహుబలి సినిమాలు పూర్తయ్యాయి. ఇక ఈ బ్యూటీ ఒప్పుకున్న సినిమా భాగమతి ఒక్కటే.. పిల్ల జమిందార్ చిత్ర దర్శకుడు అశోక్ రూపొందిస్తున్న ఈ సినిమాలో ఖులీకుత్‌బ్‌షా ప్రేయసి భాగమతిగా అనుష్క నటిస్తోంది.. సుల్తాను రాణిపాత్ర కోసం ఇలా ముద్దబంతిలా మారిపోయి ఉంటుందా అంటున్నారు.. అనుష్క వెయిట్ పెరిగినా అందమే అంటున్నారు అమె అభిమానులు.

తారాతీరం

## దెయ్యంగా అనుష్క శర్మ



బాలీవుడ్ బ్యూటీ అనుష్కశర్మ కొత్త సినిమా ఫిలౌరీ ట్రైలర్ వచ్చేసింది. టాలీవుడ్ బ్యూటీ మెహ్రీన్‌కౌర్ షీర్జాడాకు బాలీవుడ్ అరంగేట్రం మూవీ కావటంతో ఇక్కడి జనాలు కూడ ఇంట్రెస్టింగ్‌గానే ఎదురుచూస్తున్నారు. తనే నిర్మాతగా మారిన అనుష్కశర్మ.. దెయ్యం పాత్రను ఎంచుకుని ఆశ్చర్యపరిచింది. లైఫ్ ఆఫ్ పై ఫేమ్ సూరజ్ శర్మ, మాంగ్లిక్ కావటంతో ఓ చెట్టును పెళ్లి చేసుకోవాల్సి రావటంతో ట్రైలర్ మొదలవుతుంది. కథ అక్కడే మొదలవుతుంది.. దెయ్యంగా అనుష్క శర్మ లుక్ నుంచి.. స్టోరీ విషయంలో ఆమె టేస్ట్‌కు అభినందనలు వెల్లువెత్తుతున్నాయి.

కె.సురేష్ బాబు




12 ఫిబ్రవరి 2017

## మంచి ముత్యాలు

ఒక జాతిని అది ఉన్న స్థితినుంచి
అది ఉండవలసిన స్థితికి
మార్చేందుకు పోరాడేవారే
నిజమైన రాజనీతిజ్ఞులు.

-డబ్ల్యు.ఆర్.అల్జర్

## విషయ విశేషం


'సంఘీ'భావం
ప్రజా రవాణాకు ప్రాధాన్యం ఏది?... 5
మూడో కన్ను
ప్లస్‌లే ఎక్కువ......6
కవర్‌స్టోరీ
గోడలు-గొడవలు
అడ్డుగోడల వెనుక ఆంతర్యాలు ...8
జీవపరిణామ సిద్ధాంత ప్రతిపాదకుడు..12
ప్రేమ కథామాలిక
అచంచల ప్రేమ..14
స్టాంపులతో వెరైటీ 'చిత్రాలు'! ..18
కథ
దొంగలు....20
ఈవారం కవిత్వం
భూగ్రహాన్ని రక్షించుకొందాం...23






చిత్రభారతి
చిత్రరంగంలో యువతకు స్వాగతం....30
ఇంకా..కృతి, మొగ్గ,
నవ్వుల్..రువ్వుల్,
వాస్తు వార్త, పదమథనం
..వారఫలం.. వగైరా... వగైరా.


## భావ వీచిక



### అమలులో ఆలస్యం..

పార్లమెంట్‌లో బిల్లు పాస్ కాగానే ఆ చట్టం అమలయిపోయినట్లుగానే భావిస్తుంటాం. కానీ అది చట్టంగా అమలులోకి రావటానికి సగటున 261 రోజులు పడుతుందని 'విధి సెంటర్ ఫర్ లీగల్ పాలసీ' వారి రిపోర్టు తెలియ జేసింది. అంటే దాదాపుగా తొమ్మిది నెలల కాలం అన్నమాట. ఈ రిపోర్టు 2006 నుంచి 2015 వరకు పార్లమెంటు చేసిన 44 చట్టాలను విశ్లేషించింది. అయితే వీటిలో సగానికి పైగా చట్టాలు ఆరునెలల కాలవ్యవధిలో అమలులోకి వచ్చాయి. రాష్ట్రపతి ఆమోదం పొందిన బిల్లు అమలులోకి రావటానికి మరో రెండు ఘట్టాలుంటాయి. ఒకటి ఆ బిల్లు గురించి అఫిషియల్ గెజిట్‌లో నోటిఫికేషన్ ఇవ్వాలి. రెండవది ఆ నిర్దిష్ట బిల్లుకు సంబంధించి నియమనిబంధనలు రూపొందించాలి.

కొన్ని చట్టాల అమలుకు పదినెలల కాలం పట్టడం కూడా కద్దు. బ్లాక్‌మనీ సంబంధిత చట్టం అమలులోకి రావటానికి పదినెలల పదకొండురోజుల కాలం పట్టింది.

ప్రజా సంక్షేమానికి, ప్రజా ప్రయోజనా నికి సంబంధించిన బిల్లులు పార్లమెంటులో పాస్ అయ్యే ప్రక్రియ ఒక ఎత్తయితే, అనంతరం అవి చట్టాలుగా అమలయ్యేం దుకు పట్టే దీర్ఘకాలం వల్ల ఆర్థిక నష్టం, అభివృద్ధి నష్టం కూడా జరుగుతుంది. అలాకాకుండా పాసయిన బిల్లులు మరింత త్వరగా చట్టాలుగా రూపొంది, అమలయ్యే విధానాలను రూపొందించవలసిన అవసరం ఎంతైనా ఉంది. అంతటా కంప్యూటరీకరణ జరుగుతున్న నేపథ్యంలో కాలహరణాన్ని అరికట్టడం పెద్ద విషయం కాదు.

ఈ విషయంపై ప్రభుత్వం, సంబంధిత శాఖలు దృష్టి సారించి ప్రక్రియలను వేగవంతం చేసి ఆయా చట్టాలను అమలుచేసి, ప్రజలకు మేలు చేస్తే బాగుంటుంది. అన్నిటికీ మించి ప్రతివారు తమ విధిని తాము సకాలంలో చేయాలన్న లక్ష్యంతో ముందుకు సాగాలి. ఆలస్యాన్ని నిలువరిస్తే అభివృద్ధిపథంలో ముందుండటం సుసాధ్యమేమరి.

## లేఖలు

### బాలల దీనస్థితిని కళ్లకు కట్టింది..

జనవరి 29 వార్త ఆదివారం అనుబంధంలో ప్రచురించిన కవర్ స్టోరీ 'పసి బతుకులు మసి- ఇదీ బాలభారతం!' దేశంలోని బాలల దీనస్థితిని పాఠకుల కళ్లకు కట్టింది. చట్టాలెన్ని ఉన్నా చిన్నారులు చాకిరిలో మగ్గిపోవడం బాధాకరం. అందరిలో మార్పువచ్చి బాలలను పనికి కాక, బడికి పంపగలిగితేనే పరిస్థితిలో మార్పువచ్చేది. అప్పుడే దేశభవితవ్యం బాగుండేది. మీకు మా ధన్యవాదాలు.

-ఆర్.వసంతకుమార్, సికింద్రాబాద్; వి.హరి, విజయనగరం; పి.శారద, గుంటూరు.

### హృదయం బరువెక్కింది..

జనవరి 29 వార్త ఆదివారం అనుబంధంలో ప్రచురించిన కవర్‌స్టోరీ 'పసిబతుకులు మసి...' బాల భారత స్వరూపాన్ని మాముందుంచింది. చదివిన మా హృదయాలు బరువెక్కాయి. 'భావవీచిక'లో ఉదహరించినట్లు కొన్ని ఘటనల్లో డాక్టర్ల నిర్లక్ష్యం గమనిస్తే వైద్యుడు, దేవుడితో సమానం అనే నానుడికి దూరమవుతున్నారనిపిస్తుంది. ప్రాణాంతక వ్యాధుల నివారణకు రోగ నిర్ధారణే కీలకమని 'సంఘీ'భావంలో చక్కగా చెప్పారు. ఆ..కలి రాగం..కథాకర్త బి.లక్ష్మీనారాయణకు అభినందనలు. 'మూడోకన్ను'లో ట్రంప్ ధోరణిని చక్కగా విశ్లేషించారు. 'అడవిని అలంకరించిన ఉదయకాంతులు' దృశ్యం రమణీయంగా ఉంది.

-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్టణం.

### ఆసక్తిదాయక ఆర్టికల్స్

జనవరి 29 వార్త ఆదివారం అనుబంధంలో 'సంఘీ'భావం'లో ప్రాణాంతక వ్యాధుల విషయంలో నివారణ, రోగనిర్ధారణలు కీలకమని ఎంతో బాగా చెప్పారు. చిత్రభారతిలో చలనచిత్ర రంగానికి మంచిరోజులు వచ్చి సినీ కార్మికుల జీవితాల్లో వెలుగులు నిండాలని వాశిరాజు ప్రకాశం చక్కగా ఉద్బోధించారు. 'మూడోకన్ను'లో ట్రంప్ విధానం, విదేశీ వ్యవహారాల్లో విపరీత పరిస్థితి తేనున్నదో చక్కగా ఊహించారు. 'అధిగమించవలసిన ఆరు భయాలు' వ్యాసం ఎంతో బాగుంది.

-డా.శివభూషణం, కర్నూలు.

### ఢిల్లీలో గాలిబ్ హవేలీ..

జనవరి29 వార్త ఆదివారం అనుబంధంలో 'ఢిల్లీ గల్లీలో గాలిబ్ హవేలీ' ఆర్టికల్ ఎంతో ఆసక్తిదాయకంగా ఉంది. చదువుతుంటే గాలిబ్ నాటి రోజులు ఊహల్లో నిలిచాయి. అప్పుడప్పుడు ఇటువంటి ఆర్టికల్స్‌ను అందించండి.

-సి.ఆనందిని, విజయవాడ; కె.ప్రార్థన, మెదక్.

'సంఘీ'భావం



# ప్రజా రవాణాకు ప్రాధాన్యం ఏది?

దేశంలో పలు మెట్రో పాలిటన్ నగరాల్లో ఇటీవల కాలంలో పెరుగుతున్న క్యాబ్, ప్రయివేట్ బస్ ఆపరేటర్ల అత్యాచారాల పర్వం కొరవడిన ప్రజా రవాణాకు అద్దం పడుతున్నది. అది ఢిల్లీ కావచ్చు, హైదరాబాద్ కావచ్చు, మరేదైనా పల్లెటూరు కావచ్చు. విశ్వసనీయమైన ప్రజారవాణా సౌకర్యం అందుబాట్లో లేక ఏదో దొరికిన ఒక వాహనాన్ని ఆశ్రయించడంతోనే మహిళలు అత్యాచారాల బారిన పడుతున్నారు.

దేశంలోని మెట్రో పాలిటన్ నగరాలైన ముంబై, ఢిల్లీ, చెన్నై, కోల్‌కతా, బెంగళూరు, కొచ్చిన్, పూణే, హైదరాబాద్‌లలో పెరిగే జనాభాకు అనుగుణంగా ప్రజారవాణాలో కీలకమైన ప్రభుత్వ ఆర్టీసీ బస్సులు, నగర రైళ్లు అందుబాట్లో లేవు. ఒకవేళ వున్నా అవి అందుకోవాలంటే వేచివుండే సమయం గంటలు దాటుతున్నది. దీంతో నిస్పృహకు గురైన ప్రజలు లేదా ప్రయాణికులు దొరికిన ఆటో లేదా టాక్సీ నో ఆశ్రయిస్తున్నారు. వాటిని నడిపే డ్రైవర్లు ప్రయాణికులను చార్జీల రూపేణ దోచుకోవడమే కాకుండా ఒంటరిగా ఉన్న మహిళలపై అత్యాచారాలకు పాల్పడుతున్నారు. హైదరాబాద్ హైటెక్ సిటీలో గత సంవత్సరం సాఫ్ట్‌వేర్‌లో పనిచేసే యువతిని ఇద్దరు క్యాబ్ డ్రైవర్లు అత్యాచారం చేసారు. ఢిల్లీలో ప్రైవేట్ బస్సులో దారుణమైన నిర్భయ ఉదంతం జరిగింది. అయినా ఇప్పటికీ దేశంలోని ఏ మెట్రోపాలిటన్ నగరంలోనైనా విశ్వసనీయమైన, భద్రమైన ప్రజారవాణా పూర్తిగా అందుబాటులోకి రాకపోవడం బాధాకరమైన విషయం. దీనికోసం పాలకులు ఇప్పటికీ శ్రద్ధ వహించకపోవడం దీనికి అనుకూల విధానాలు ప్రవేశపెట్టకపోవడంతో ప్రైవేటు రవాణా రోజురోజుకు పెరుగుతున్నది. ఇది చివరకు ప్రజా రవాణా 20 శాతమైతే, ప్రయివేట్ రవాణా 80 శాతంగా పెరిగింది.

దేశంలో బస్సులకు విశ్వసనీయ ప్రత్యామ్నాయంగా ఉన్న మెట్రో రైల్ వ్యవస్థ ఇంకా అన్ని నగరాల్లో అందుబాట్లోకి రాలేదు. గ్రామాల నుంచి ఉపాధికోసం, చదువులకోసం నగరాలకు వలసలు రోజురోజుకు పెరుగుతూనే ఉన్నాయి. దీనివల్ల నగరాల విస్తృతి వందల కి.మీ. దాటుతున్నది. శివార్లలో కాలనీలు, టౌన్‌షిప్‌లు భారీగా పెరుగుతున్నాయి. పెరుగుతున్న ట్రాఫిక్ రద్దీని తట్టుకోవడానికి కొన్ని నగరాల్లో ఫ్లై ఓవర్లు, ఎక్స్‌ప్రెస్ వేలు, ఔటర్ రింగ్‌రోడ్లు, పట్టణాల్లో బైపాస్ రోడ్లు ఏర్పాటు చేస్తున్నారు. కొంతమేరకు రోడ్ల విస్తృతి పెరిగినా ఆ మేరకు బస్సుల సంఖ్య పెరగడం లేదు. వాటిని సరైన శాస్త్రీయ పద్ధతిలో నడపడం లేదు.

ఒక హైదరాబాద్‌నే ఉదాహరణగా తీసుకుంటే.. ఇక్కడ 1300 బస్సు రూట్లు ఉన్నాయి. 2800 బస్ స్టాపులు ఉన్నాయి. వేలాది బస్సులున్నాయి. కానీ ఎక్కడ చూసినా బస్ స్టాపుల్లో ముఖ్యంగా ఉదయం, సాయంత్రం వేళల్లో వేలకొలది ప్రయాణికులు బస్సులకోసం ఎదురుచూస్తున్న దృశ్యం అందరికీ తెలిసిందే. ఒకవేళ బస్సులు వచ్చినా ఆలస్యంగా రావడంతో వాటి ఫుట్‌బోర్డులపై కిక్కిరిసి ప్రజలు ప్రయాణం చేయాల్సిన దుస్థితి ఏర్పడింది. వేలాడుతూ వెళ్లినా, కిక్కిరిసిన ప్రయాణికులతో ప్రయాణం చేసినా గమ్యస్థానం చేరుతామో లేదో తెలియని పరిస్థితి ఉంది. హైదరాబాద్‌లోని ఎల్‌బి నగర్ నుంచి హైటెక్ సిటీకి చేరుకోవాలంటే ట్రాఫిక్ మహాసముద్రాన్ని ఈదాల్సిందే. ఇందుకోసం ప్రయాణికులు 2 నుంచి మూడు గంటలు సమయాన్ని వృధా చేసుకుంటున్నారు. ఎక్కడా బస్సులు చెప్పిన టైముకు రావు. దీంతో ఇతర వర్గాలకన్నా మహిళా ఉద్యోగులు ప్రజా రవాణాలో నరకాన్ని అనుభవిస్తున్నారు. దేశంలో ప్రజారవాణాకు ఇండోర్ నగరాన్ని ఆదర్శంగా తీసుకోవచ్చు. ఇక్కడి ప్రజా రవాణాను పరిశీలించిన నిపుణులు దీన్ని కొలంబోలోని బొగోటోతో పోల్చారు. అక్కడ ప్రజా రవాణా కీలకపాత్ర వహిస్తున్నది. అక్కడ ప్రయివేటు వాహనాలకంటే ప్రజా రవాణాకే ఎక్కువ ఆదరణ ఉంది. అదేమాదిరిగా ఇండోర్‌లో కూడా ప్రజలు బస్సులకోసం గంటల తరబడి వెయిట్ చేయాల్సిన పరిస్థితి లేదు. అలాగే రూట్లనుబట్టి బస్సులకు అక్కడ రంగులు వేసారు. వీటి ఆధారంగా నిరక్షరాస్యులు కూడా తమ బస్సు రంగును గుర్తుంచుకుని గమ్యస్థానానికి చేరుకునే వీలు కలుగుతోంది. అక్కడ వెయిటింగ్ టైమ్ ఎప్పుడూ నిమిషాలు దాటదు. నిజంగా ఇది ప్రజా రవాణాలో అద్భుత విషయమని చెప్పవచ్చు. ఇక్కడ అన్ని బస్సుల్లో వైఫై సౌకర్యాలు కూడా కల్పించారు. దీంతో దూరం వెళ్లే ప్రయాణికులు బస్సులోనే కూర్చుని కొంత ఆఫీస్ పని పూర్తి చేసుకునే అవకాశం కలిగింది.

ప్రజా రవాణాను మెరుగుపరుస్తామని ఊదరగొడుతున్న పాలకులు ఈ రంగంలో వినూత్న విధానాలు ప్రవేశపెట్టడం అటుంచితే ఆదర్శ నగరంగా ఉన్న ఇండోర్‌లో పరిస్థితిని క్షేత్ర స్థాయిలో అధ్యయనం కూడా చేయలేని పరిస్థితి దాపురించింది. ప్రజా రవాణాకు అవకాశం లేక ప్రజలు టూవీలర్‌నో, కార్‌నో కొనుగోలు చేస్తున్నారు. చెన్నై, ముంబైలో సిటీ రైళ్లకు బహుళ ఆదరణ ఉంది. అక్కడ వెయిటింగ్ టైమ్ తక్కువ కావడంతో దూర ప్రాంతాలకు వెళ్లే హైటెక్ ఉద్యోగులు కూడా రైళ్లల్లో ప్రయాణిస్తున్నారు. ఒక బస్సులే కాకుండా మెట్రో రైళ్లు, ప్రధాన రోడ్లపై బిఆర్‌టిఎస్ రూట్లను ఏర్పాటు చేయాలి. అంటే రోడ్డు మధ్యలో బస్సులు ప్రత్యేకంగా ప్రయాణించేలా బిఆర్‌టిఎస్ సిస్టమ్‌ను అభివృద్ధి చేయాలి. అప్పుడే ప్రయాణికులకు ప్రజా రవాణాపై విశ్వసనీయత కలుగుతుంది.

ఏ దేశ ఆర్థికవ్యవస్థ అయినా మౌలిక వసతులు, రవాణా వ్యవస్థపైనే ఆధారపడి ఉంది. ఈ రెండు వ్యవస్థలు ఎంతగా అభివృద్ధి చెందితే అంతగా ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుంది. దేశంలో ప్రజా రవాణా సౌకర్యాలను అంతర్జాతీయ ప్రమాణాలతో పోల్చి చూస్తే మన సౌకర్యాలు అతి దారుణంగా ఉన్నాయి. ఇది ప్రైవేటు రవాణాను ఆకర్షించేలా ఉంది.

ప్రయివేటు రవాణాకు వాడుతున్న వాహనాలతో ధీటుగా ప్రజా రవాణా వాహనాలు మెరుగుపడితేే తప్ప ప్రయాణికులకు ప్రభుత్వ బస్సులపై నమ్మకం ఏర్పడదు. సుదూర ప్రయాణం చేసే ప్రజలు ముందుగా బస్సులో కూర్చునే సీట్లనుంచి మొదలుకుంటే ఇచ్చే నీరు, టీ, బిస్కెట్ లాంటి ప్రోత్సాహకాలతోపాటు బస్సు స్పీడు, బస్సులో వైఫై లాంటి సౌకర్యాలు చివరకు సిసి కెమెరాల్లాంటివి ఉన్నాయా? లేవా? అని చూసి ప్రయాణిస్తున్నారు. ప్రైవేట్ రంగంతో ప్రభుత్వ రంగ బస్సులు పోటీపడాలంటే విధాన నిర్ణయాల్లో మార్పులు రావాలి. అప్పుడే ప్రజా రవాణా సామర్థ్యం, భద్రత మరింత పెరుగుతుంది.

– డాక్టర్ గిరీష్‌కుమార్ సంఘీ




# ప్లస్‌లే ఎక్కువ..

– ఎ.వి.వి. ప్రసాద్

**పెద్ద నోట్ల రద్దు తర్వాత రూపొందించిన బడ్జెట్‌పై దేశవ్యాప్తంగా కనిపించిన 'అలజడి' ప్రభావం ఎంతో కొంత కనిపించిందనే చెప్పాలి. ఉద్యోగ కల్పన, స్టార్టప్‌లు, సరళీకృత వాణిజ్య నిర్వహణ, వ్యావసాయిక ఉత్పత్తి భారత్‌లో తయారీ వంటి కొన్ని కీలక అంశాలపై పెద్ద నోట్ల రద్దు ప్రభావం ఎక్కువగానే కనిపించినా పన్ను చెల్లింపు దారుల సంఖ్య పెరగడం, పొదుపు నిల్వలు పెరగడం, పెట్టుబడులకు మరిన్ని వనరులు అందుబాటులోకి రావడంతో కొన్ని ప్రయోగాలను జైట్లీ ఈ బడ్జెట్‌లో 'సక్సెస్‌ఫుల్'గా చేశారనే చెప్పాలి. గత అన్ని బడ్జెట్‌లకంటె కొత్తగా కనిపించే అంశం 'డిజిటల్ వ్యవస్థ'కు అత్యంత ప్రాధాన్యమీయడం, ఆర్థికనేరగాళ్లపై కొరడా ఝుళిపించడం. రాజకీయ అవినీతికి కళ్లెం వేయడానికి కూడా జైట్లీ కొన్ని చర్యలు ప్రతిపాదించారు. అయితే పేదరిక నిర్మూలనకు నిర్దిష్టమైన పథకాలేవీ రూపొందించకపోవడం పెద్ద లోటుగా కనిపిస్తుంది...**

**పసిడి భవితనీయ పన్ను భారములేని**
**చల్లనైన జల్లు జైట్లీ పద్దు;**
**సరళి మారె కేంద్ర సర్కారు బడ్జెట్టు**
**విశ్వవినుత నామ! వినురవేమ!!**

పద్దులు మన నడతకు నిలువుటద్దాలు. వ్యక్తిగతం కావచ్చు, ఒక రాష్ట్రానికో, దేశానికో చెందినవికావచ్చు..మొత్తానికి మన స్వభావాన్ని అద్దంపట్టేవిగానే అవి కనిపిస్తాయి. ఇంటికైతే వారానికో, నెలకో పద్దులు రూపొందించుకొంటూ ఉంటారు. అదే దేశానికైనా, రాష్ట్రానికైనా ఏడాదికో సారి ఆదాయాలు, వ్యయాలు అంచనా వేసుకొని ఒక 'సమతుల్యత' పాటిస్తూ బడ్జెట్లు రూపొందిస్తారు. వ్యక్తిగతమైతే ఆ పద్దుల పరిధి చాలా చిన్నదిగా కనిపిస్తుంది. దేశానికైతే చాలా విస్తృతంగా ఉంటుంది. వ్యక్తిగతంపై పడే బాహ్యప్రభావాలు తక్కువ..దేశ బడ్జెట్‌పై వాటి ప్రభావం చాలా ఎక్కువ..ఎన్నో రాష్ట్రాలు ..ఎన్నెన్నో రంగాలు.. వాటన్నింటిని 'సంతృప్తి'పరచే విధంగా ఆ బడ్జెట్లు రూపొందుతూ ఉంటాయి. వ్యయం కంటె ఆదాయం ఎక్కువగా ఉంటే ఆర్థిక వ్యవస్థ పుష్టిగా ఉన్నట్లే. అది ఇంటికైనా, దేశానికైనా సమానమే. కానీ ఆదాయం కంటె వ్యయం ఎక్కువగా ఉన్నప్పుడే ఒడిదుడుకులు ఎదురవుతూ ఉంటాయి. రాబడి-ఖర్చు మధ్య కనిపించే 'లోటు'ను భర్తీ చేసుకొనడానికి అనేకానేక మార్గాలను అన్వేషించవలసి వస్తుంది. ఈ మార్గాన్వేషణ వ్యక్తులకైతే చిన్నదిగా ఉంటుంది, దేశానికైతే పెద్దదిగా ఉంటుంది. ఏ పద్దుల గురించైనా ముందుగా చెప్పుకోవలసిన మాటలివి. ఇక్కడ గమనించవలసిన విషయం ఒకటి ఉంది. పద్దులు రూపొందించుకొనే సమయంలో నేల విడచి సాము చేస్తే కాళ్ల కింద నేల కరిగిపోయి చివరికి బోర్లా పడవలసి వస్తుంది. అందుకే సరైన, ఆరోగ్యకరమైన 'ప్రణాళిక' ఉండాలంటారు.

ఆ ప్రణాళికలు రూపొందించటానికి ఎంతో బృహత్తరమైన వ్యవస్థ అవసరమవుతుంది. ఆర్థిక శాఖేగాక ప్రణాళికా సంఘం, ఇప్పుడైతే నీతి ఆయోగ్ ఆ విధులు నిర్వహించడానికి ఏర్పాటయ్యాయి. అంత జాగ్రత్తగా ఎంతో 'స్క్రూటినీ' తర్వాత ఖరారుచేసే పద్దులు కూడా ఒక్కొక్కసారి అంచనాలను తలకిందులు చేస్తుంటాయి. అందుకే మధ్యమధ్యలో సమీక్షలు జరిపి 'తుది అంచనాలు' ఖరారు చేస్తుంటారు. ఈ నేపథ్యంలోంచి చూస్తే 2017-18 సంవత్సరానికి కేంద్ర ఆర్థికమంత్రి అరుణ్ జైట్లీ ఫిబ్రవరి ఒకటవ తేదీన పార్లమెంటుకు సమర్పించిన వార్షిక బడ్జెట్ చాలా సరళంగా, సంస్కరణాత్మకంగా ఉన్నదనే అనిపిస్తుంది.



పెద్దనోట్ల రద్దు తర్వాత దేశంలో కనిపించిన అలజడి, ఆర్థిక వ్యవస్థకు కలిగిన ఒడిదుడుకుల ప్రభావం బడ్జెట్‌పై కొంతమేరకు కనిపించినా, మొత్తంమీద అన్ని వర్గాలకు సంతృప్తి కలిగే విధంగానే జైట్లీ తాజా బడ్జెట్‌ను రూపొందించారని కూడా అనిపిస్తుంది. ఈ బడ్జెట్‌లో ప్రత్యేకంగా ప్రస్తావించవలసిన అంశాలు చాలా ఉండడం కూడా ప్రత్యేకమే. మార్పు కోసం మార్పును తలపెట్టడంగాక, ఒక స్థిరమైన లక్ష్యాన్ని చేరుకొనడానికి కొత్తబాటలు రూపొందించుకోవడం కూడా ఈ బడ్జెట్‌లో ముఖ్యంగా కనిపిస్తుంది. గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి, రైతు సంక్షేమం, అదే సమయంలో పారిశ్రామికీకరణకు పెద్దపీట, అత్యాధునిక సాంకేతిక అభివృద్ధికి తగిన ప్రాధాన్యం సమపాళ్లలో రంగరించడంతో పద్దులన్నీ ఒక క్రమబద్ధమైన మార్గంలో సాగినట్లే అనిపిస్తుంది.

కొన్ని రంగాలకు కేటాయింపులు పెంచడం, మరికొన్ని రంగాలకు తగ్గించడం ప్రతి బడ్జెట్‌లోనూ కనిపించే విషయమే. అయితే తాజా బడ్జెట్‌లో కీలక రంగాలన్నిటికి కేటాయింపులు సమృద్ధిగా పెంచుతూ దాదాపు 21.47 లక్షల కోట్ల రూపాయల బడ్జెట్‌ను జైట్లీ ప్రతిపాదించారు. సాధారణంగా ప్రణాళిక, ప్రణాళికేతర వ్యయం ప్రతి బడ్జెట్ లోనూ కనిపిస్తూంటుంది.

కొన్ని సంవత్సరాలుగా ప్రణాళికా వ్యయం కంటె ప్రణాళికేతర వ్యయం పెరిగిపోతుండడంతో దాని ప్రభావం ఆర్థిక వ్యవస్థపై అనేక దుష్ప్రభావాలను చూపిస్తోంది. ప్రణాళికేతర వ్యయం అమితంగా పెరిగిపోవడానికి హద్దు, అదుపులేనివిధంగా వివిధ 'సంక్షేమ పథకాలు' అమలు చేయడమే కారణం. ఏ ప్రభుత్వం అధికారంలో ఉన్నా దాని పరమోద్దేశం ఓటర్లను ఆకర్షించే విధానమే గనుక ప్రణాళికేతర వ్యయం ఎంతగా పెరిగిపోతున్నా పట్టించుకోని పరిస్థితి ఏర్పడుతోంది. దానివల్ల ప్రజలపై పరోక్ష పన్నులను అధికంగా విధిస్తూ సేవా పన్నులను కూడా బాగా పెంచుతున్నారు. అవి అలా పెరిగి పెరిగి ఒక వినియోగ వస్తువు అసలు విలువ పది రూపాయలనుకొంటే దానిని నూరు రూపాయలకు కొనుగోలు చేయవలసిన దుస్థితి ప్రజలకు ఎదురవుతోంది. ఓటర్లకు లాప్‌టాప్‌లు, కంప్యూటర్లు, కలర్ టీవీలు పంచిపెడుతూంటారు. రెండు రూపాయలకో, ఐదు రూపాయలకో మూడు, నాలుగు సాంబారిడ్లీలు ప్రజల నోటికి అందిస్తూంటారు. అలాంటివి అనేకరకాలు. ప్రజల సంక్షేమాన్ని తాము మాత్రమే పట్టించుకొంటున్నామనే భ్రమను కలిగించడానికి అలాంటి 'ఉచిత' పథకాలెన్నిటినో ప్రతి రాష్ట్ర ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం అమలుచేయడం రివాజుగా మారిపోయింది. దానంతటికి అయ్యే వ్యయంలో అధికశాతం అనుత్పాదకమే. అంటే వ్యయం ప్రణాళికాబద్ధమైనదిగా కంటె ప్రణాళికేతరంగా ఎక్కువ ఎదగడంతో స్థూల దేశీయ ఉత్పత్తి (జిడిపి)పై దాని ప్రభావం అధికంగా పడి అభివృద్ధి మందగిస్తోంది. వృద్ధిరేటు పెరుగుతున్నదని ప్రభుత్వాలు లెక్కలుచూపవచ్చు. కానీ వాస్తవ అభివృద్ధి ఆ మొత్తంకంటె ఎప్పుడూ దిగువనే ఉంటోంది. అందుకే ప్రణాళికేతర వ్యయాన్ని కట్టడి చేయాలని ఆర్థిక నిపుణులు సూచిస్తుంటారు. సబ్సిడీలపై విధించే కోత

అటువంటిదే. సబ్సిడీల భారం మొత్తం బడ్జెట్‌నే మింగివేసే స్థాయికి చేరడంతో గత పదేళ్లలో వాటిపై కోతను భారీగానే విధిస్తున్నారు.. అయినా అవి పెద్దమొత్తంలో ప్రణాళికావ్యయాన్ని మింగేస్తూండడంతో మొత్తం బడ్జెట్ రూపురేఖలనే సమూలంగా మార్చివేసే ప్రయత్నాన్ని ఈ బడ్జెట్‌లో జైట్లీ చేసినట్లు కనిపిస్తుంది. అదేవిధంగా రైల్వే బడ్జెట్‌ను విలీనం చేయడం కూడా. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత తొలిసారి రైల్వే రంగానికి ప్రత్యేక బడ్జెట్‌ను తొలగించి సాధారణ బడ్జెట్‌లో కలిపారు. దీనివల్ల జైట్లీగానీ, కేంద్ర ప్రభుత్వం గాని ఆశించిన ప్రయోజనమేమిటో తెలియదుగాని మొత్తం బడ్జెట్ చాలా గందరగోళంగా మారిందనే అభిప్రాయం ఎక్కువగా వినిపించింది.

**********

పెద్ద నోట్ల రద్దు తర్వాత రూపొందించిన బడ్జెట్‌పై దేశవ్యాప్తంగా కనిపించిన 'అలజడి' ప్రభావం ఎంతో కొంత కనిపించిందనే చెప్పాలి. ఉద్యోగ కల్పన, స్టార్టప్‌లు, సరళీకృత వాణిజ్య నిర్వహణ, వ్యావసాయిక ఉత్పత్తి భారత్‌లో తయారీ వంటి కొన్ని కీలక అంశాలపై పెద్ద నోట్ల రద్దు ప్రభావం ఎక్కువగానే కనిపించినా పన్ను చెల్లింపుదారుల సంఖ్య పెరగడం, పొదుపు నిల్వలు పెరగడం, పెట్టుబడులకు మరిన్ని వనరులు అందుబాటులోకి రావడంతో కొన్ని ప్రయోగాలను జైట్లీ ఈ బడ్జెట్‌లో 'సక్సెస్‌ఫుల్'గా చేశారనే చెప్పాలి. గత అన్ని బడ్జెట్‌లకంటే కొత్తగా కనిపించే అంశం 'డిజిటల్ వ్యవస్థ'కు అత్యంత ప్రాధాన్యమీయడం, ఆర్థిక నేరగాళ్లపై కొరడా ఝుళిపించడం. రాజకీయ అవినీతికి కళ్లెం వేయడానికి కూడా జైట్లీ కొన్ని చర్యలు ప్రతిపాదించారు. అయితే పేదరిక నిర్మూలనకు నిర్దిష్టమైన పథకాలేవీ రూపొందించకపోవడం పెద్ద లోటుగా కనిపిస్తుంది.

డిజిటల్ వ్యవస్థ ముఖ్యంగా ఆర్థిక లావాదేవీలలో ఈ విధానం దేశాన్ని కొత్తపుంతలు తొక్కిస్తుందన్నది మోడీ ఆకాంక్ష. పెద్దనోట్ల రద్దు తర్వాత పెద్దగా వినిపించిన పదం కూడా అదే. నల్లధనం ఏరివేత, నకిలీ కరెన్సీ కట్టడి వంటి ప్రయోజనాలు పెద్ద నోట్ల రద్దువల్ల ఆకాంక్షించినా ప్రధానంగా డిజిటల్ విధానంవైపు ఆర్థిక వ్యవస్థను మళ్లించడమే ప్రధాని, ఆర్థికమంత్రి లక్ష్యంగా కనిపిస్తుంది. అయితే దానికి తగిన 'గ్రౌండ్ వర్క్' తగినంత జరగకుండా నేరుగా లక్ష్యం వైపు పరుగు తీసినట్లుగా కూడా అనిపిస్తుంది. ఆర్థిక లావాదేవీలల్లో డిజిటల్ చెల్లింపులను ప్రోత్సహించడానికి వీలుగా 'పాయింట్ ఆఫ్ సేల్' (పిఒఎస్) యంత్రాలు, ఐరిస్ రీడర్లపై సుంకం మినహాయింపు వంటి ప్రతిపాదనలు కొన్ని చేశారు. అవి మంచిదే అయినా దేశంలో 'కంప్యూటర్ అక్షరాస్యత' లేదా ఎలక్ట్రానిక్ పరికరాల వినియోగం ఇంకా 25 శాతం కూడా దాటని దశలో డిజిటల్ వ్యవస్థను తేలికగా ఎలా చేరుకోగలుగుతామో వివరించి ఉంటే బాగుండేది.

మన దేశం ఇంకా 60 శాతందాకా వ్యవసాయ రంగంపైనే ఆధారపడి ఉన్నదన్నదాన్ని కాదనలేం కదా! అంటే గ్రామీణ వ్యవస్థ ఎక్కువగా ఉన్న మన దేశంలో డిజిటల్ విప్లవం రావాలంటే తొలుత ప్రతి వ్యక్తికి ఎంతో కొంత కంప్యూటర్ పరిజ్ఞానం లభించే చర్యలు తీసుకోవాల్సి ఉంటుంది. సాధారణంగా మన రాజకీయ పార్టీలకు కంప్యూటర్లు, లాప్‌టాప్‌లు ఎన్నికల సమయంలోనే గుర్తుకు వస్తూంటాయిగనుక ఆ పార్టీలు అధికారంలోకి రాగానే ప్రజలకు ఎలక్ట్రానిక్ అక్షరాస్యత పెంచే విషయం మరచిపోతుంటాయి. ఆ కారణంగానే నగరాల్లో, పట్టణాల్లో అధికంగా కనిపించే ఎటిఎంలు గ్రామాలలో అదృశ్యమవుతున్నాయి. 'ఇ- పేమెంట్స్' జరిపే యంత్రాలు, విడి భాగాల తయారీపై పన్నుల మినహాయింపు మంచిదే అయినా తొలుత ఒక వ్యవసాయ కార్మికుడు, రిక్షాపుల్లర్ కూడా ఆ ఇ-పేమెంట్ జరిపే స్థాయికి ఎదిగే అవకాశం కల్పించగలిగితే డిజిటల్ వ్యవస్థ తేలికగానే ఆవిష్కృతమవుతుంది. లేకుంటే కేవలం కొందరు పెట్టుబడిదారుల లాభార్జనకు మాత్రమే ఆ రాయితీలు ఉపయోగపడతాయనిపిస్తుంది. పథకాల విషయంలో కేంద్రం, రాష్ట్ర ప్రణాళిక అనే విభజన చూపకుండా కేంద్రం అమలు చేసే పథకాలు, రాష్ట్రాలకు సహాయం అందించే పథకాలుగా విభజించడం ఈ బడ్జెట్‌లోని మరో కొత్త కోణం. దీనివల్ల రాష్ట్రాలు అమలు చేసే వివిధ ప్రాజెక్టులకు కేంద్ర సాయం ఏవిధంగా ఉంటుందో, ఎంతెంత ఉంటుందో పారదర్శకంగా కనిపిస్తుంది. త్వరలో జిఎస్‌టి విధానం అమలులోకి రానుండడంతో పరోక్ష పన్నులను ఎక్కువ 'టచ్' చేయకుండా సాధారణ ప్రజలపై అదనపు భారమేదీ మోపకుండా జైట్లీ ఈ పద్దులను రూపొందించడం మరో విశేషం.

సాధారణ, మధ్య తరగతి వర్గాలు, ఆదాయ వర్గాలకు ఎంతో కొంత ఊరట కలిగించే విధంగానే బడ్జెట్ ఉన్నప్పటికి నోట్ల రద్దు ప్రభావంవల్ల దేశానికి జరిగిన లాభమెంత? నష్టమెంత? అనే విషయాలను సామాన్యులకు అర్థమయ్యేలా చెప్పి ఉంటే బడ్జెట్ మరింత జనరంజకంగా కనిపించి ఉండేదనిపిస్తుంది. ఎంత నల్లధనం వెలికితీయగలిగారు, ఎంత శాతం ఆర్థిక వ్యవస్థ నష్టపోయిందనే అంశాలను బడ్జెట్‌లో గణాంకాలతో వివరించి ఉంటే మోడీ ప్రభుత్వానికి పారదర్శక ప్రభుత్వంగా మరింత పేరు వచ్చి ఉండేది. ఐదేళ్లలో దేశంలోని రైతుల ఆదాయం రెండింతలు చేయడం, దేశవ్యాప్తంగా గ్రామీణ ప్రాంతాల్లో ఉపాధి, కనీస మౌలిక సౌకర్యాల పెంపు, యువతకు సరైన విద్య, నైపుణ్యాల అభివృద్ధి, ఉద్యోగ కల్పనద్వారా సాధికారత నెలకొల్పడం, సామాజిక భద్రత, ఆరోగ్య రంగాలను బలోపేతం చేయడం, చౌకగా గృహాలను అందించడం ద్వారా పేద, వెనుకబడిన వర్గాలకు తోడ్పాటు, నిజాయితీగా పన్నులు చెల్లించేవారికి ప్రోత్సాహకాలు వంటి 'పాజిటివ్' అంశాలు జైట్లీ తాజా బడ్జెట్‌లో అనేకం ఉన్నా రైల్వే బడ్జెట్‌ను విలీనం చేయడం ద్వారా 'బడ్జెట్ రూపకల్పన'లో కలిగే ప్రయోజనమేమిటో స్పష్టంగా చెప్పలేకపోయారు. అదేవిధంగా స్థూల దేశీయ ఉత్పత్తిలో ద్రవ్య లోటును 3 శాతానికి తగ్గించగలరని అంతా భావించారుగానీ చివరికి 3.2 శాతంకంటె తగ్గించలేకపోయారు. అలాగే ద్రవ్యోల్బణాన్ని అరికట్టేందుకు, పెరుగుదల శాతాన్ని నిరోధించేందుకు ఎటువంటి చర్యలు తీసుకోదలిచారన్నది కూడా స్పష్టంగా పేర్కొనలేదు. ఇలాంటి కొన్ని 'మైనస్'లు మినహాయిస్తే సంస్కరణాభిలాషతో ప్రతిపాదించిన తాజా బడ్జెట్‌లో ప్లస్‌లే అధికంగా కనిపిస్తాయి.

అన్నిటికంటె ముఖ్యంగా ఆర్థిక నేరగాళ్లపై జైట్లీ ఝుళిపించిన కొరడా ప్రశంసనీయం. 'అవినీతిరహిత పాలన' అనే మోడీ లక్ష్యానికి దగ్గరగా జైట్లీ ఈ బడ్జెట్‌లో కొన్ని ప్రతిపాదనలు చేయడం గమనించవలసిన అంశం. ఆర్థిక నేరగాళ్లను నిరోధించడానికి అవసరమైతే ఒక కొత్త చట్టాన్ని కూడా తీసుకువస్తామని జైట్లీ తమ బడ్జెట్ ప్రసంగంలో హామీ ఇచ్చారు. విజయ్‌మాల్యా వంటి కొందరు ఆర్థిక నేరస్తులు చట్టానికి దొరకకుండా తప్పించుకుతిరగడాన్ని పరోక్షంగా ప్రస్తావిస్తూ అటువంటివారి ఆటలు ఇక సాగవనీ, వారి ఆస్తులను స్వాధీనం చేసుకొనేందుకు వీలుగా కొత్తచట్టం రూపొందిస్తామనీ ఆర్థికమంత్రి చెప్పారు. ఈ చట్టం నిజంగా చేస్తే మోడీ ప్రభుత్వం గొప్ప సాహసం చేసినట్లే అనుకోవాలి. రాజకీయ పార్టీల 'ఆర్థిక అవినీతి'కి చెక్ పెట్టేందుకు రెండువేల రూపాయలు దాటిన ప్రతి విరాళం ఇక 'లెక్క'లోకి వచ్చేట్లుగా నిబంధనలు రూపొందించడం జైట్లీ-మోడీ బడ్జెట్‌లోని మరో సాహసమేనని చెప్పాలి.. ఎందుకంటే విరాళాలు భారీగా లభించే పార్టీలలో బిజెపి మొదటి వరుసలో ఉన్నప్పటికి చాలా చొరవ తీసుకొని బడ్జెట్‌లో ఆ నిబంధనలు రూపొందించారనే అనిపిస్తుంది. రెండువేలు మించిన విరాళాలను చెక్కులు లేదా ఎలక్టొరల్ బాండ్ల రూపంలో ఇవ్వాలనడం వల్ల పార్టీలు ఇక 'బాధ్యతా'యుతంగా వ్యవహరించవలసిన అవసరం ఏర్పడుతుంది.

ఐదు రాష్ట్రాల ఎన్నికలు జరుగుతుండగా ప్రవేశపెట్టిన బడ్జెట్ కావడంవల్ల కాబోలు! కొన్ని వర్గాల వారికి తొలుత ఆశించినట్లుగా రాయితీలు తాజా బడ్జెట్‌లోకి రాలేకపోయాయి. ఎన్నికల ఫలితాలు చూసుకొని బహుశా వాటిని ప్రకటిస్తారేమో! ఏదిఏమైనా కొన్ని మైనస్‌లున్నా, ఎక్కువ ప్లస్‌లు సాధించిన బడ్జెట్‌గా జైట్లీ పద్దులు ఉండడం, సంస్కరణల బాటలో సాగడం అభినందనీయం.



# గోడలు..గొడవలు

## అడ్డుగోడల వెనుక అంతర్యాలు..

కవర్ స్టోరీ
గన్ని మోహన్
సీనియర్ రిపోర్టర్, స్టేట్ బ్యూరో.

ఇంటికే నాలుగు వైపుల ప్రహరీగోడ ఏర్పాటు చేసుకోవటం సర్వసాధారణం. కొంతమంది గాజుపెంకులుంచిన ప్రహరీ గోడను సైతం ఏర్పాటుచేసుకోవడం కూడా తెలిసిందే. ఇందుకు ప్రధానకారణం దొంగల చొరబాటును నివారించటమే. మరి ఇళ్ల విషయంలోనే ఇంత జాగ్రత్త ఉన్నప్పుడు దేశాల విషయంలో.. సరిహద్దుల వద్ద పక్కా గోడ కట్టుకోవాలనే భావన ఉండటంలో ఆశ్చర్యంలేదు. శత్రుసైన్యాల దాడిని నివారించటానికి, అక్రమ చొరబాట్లను అడ్డుకోవటానికి ఈ గోడలు ఉపయోగ పడతాయన్నది ఆయా దేశాల ఆలోచన. అయితే అంతటి పెద్దపెద్ద అడ్డుగోడల నిర్మాణం తేలికపనేం కాదు. అది ఎంతో వ్యయ ప్రయాసలతో కూడుకొన్నది. దేశాల మధ్య స్నేహసంబంధాలు, సుహృద్భావన ఉన్నప్పుడు అసలు ఇలాంటి అడ్డుగోడల అవసరమే ఉండదు. కానీ శాంతి మాటలు మాట్లాడుతూనే, దాడులకు పాల్పడే వైఖరులున్నప్పుడు జాగ్రత్తపడక తప్పదు. అయితే గోడలు దేశాలకు పూర్తి భద్రతనిస్తాయా అంటే కాదన్నది జగమెరిగినదే. ఎందుకంటే ఆకాశ మార్గాన, జలమార్గాన ..ఆధునిక సాంకేతికతో ఎలాంటి విధ్వంసఘటనలైనా క్షణాలలో సంభవించటం చూస్తూనే ఉన్నాం. అయితే తాజాగా అగ్రదేశం అమెరికా- మెక్సికోల మధ్య గోడకట్టి తీరుతామని అమెరికా నూతన అధ్యక్షుడు ట్రంప్ అనటం వివాదాస్పదమైంది. ఈ నేపథ్యంలో ప్రపంచంలోని వివిధ దేశాల సరిహద్దుల్లోని గోడలు-గొడవల గురించిన వివరాలు...విశేషాలు ఈవారం మీకోసం..

వలసవాదులను అరికట్టడానికి, మాదక ద్రవ్యాల నిరోధానికి, ఉగ్రవాదుల చొరబాట్లను అరికట్టేందుకు ఆయాదేశాలన్నీ మరింత కట్టుదిట్టమైన చర్యలు అవలంబిస్తు న్నాయి. భారత్‌పరంగా పాకిస్తాన్, బంగ్లా దేశ్, చైనా సరిహద్దులతోపాటు మొత్తం ప్రపంచంలోని 64 దేశాల్లో ఈ అంతర్జాతీయ సరిహద్దు గోడలు నిర్మిస్తు న్నారు. కొన్నివేల ఏళ్లనుంచి ఈ గోడలు ఉన్నా మరికొన్ని దేశాలు వాటిని మరింత పటిష్టం చేస్తున్నారు.

### తాజాగా అమెరికా- మెక్సికో గోడ గొడవ..

దేశాల మధ్య ఉన్న సరిహద్దును మూసేయాలని అమెరికా కొత్త అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ నిర్ణయించడంతో పాటు ఇందుకు సంబంధించిన ఉత్తర్వులు కూడా విడుదల చేసారు. దీనిపై ఒక్కపైసా కూడా ఇవ్వబోమని స్పష్టంచేసిన మెక్సికోకు అవసరమైతే ఆ దేశం దిగుమతులపై ఆంక్షలు విధించడంతోపాటు దిగుమతిసుంకాలు 20 శాతం వరకూ విధించి గోడ నిర్మాణానికి నిధులు సమీకరిస్తామని ట్రంప్ బదులివ్వడం వెనుక మెక్సికోనుంచి వస్తున్న మాదక ద్రవ్యాల రవాణా, అక్రమ వలసలను కట్టడి చేయాలన్న ఉద్దేశమేనని తెలుస్తోంది. ఒక్క అమెరికాయే కాదు ఇపుడిపుడే ప్రపంచ దేశాల్లో ఆయా దేశాల ఆర్థిక వృద్ధికోసం ముందుగా ఉపాధి కల్పనను వృద్ధిచేసు కుంటున్నాయి. ఇందుకు విదేశీ వలసలపై దృష్టిపెట్టాయి. వాటిని కట్టడిచేసేందుకు కొన్ని దేశాలు ప్రయత్నిస్తుంటే మరికొన్ని దేశాలు తీవ్రస్థాయి ప్రాణాంతక వ్యాధులు పొరుగుదేశాల్లోని జంతువులు, వ్యక్తుల ద్వారా సంక్రమించకుండా ఉండేందుకు మరి కొన్ని కట్టడిచర్యలు తీసుకుంటున్నాయి.

మొత్తం 1933 మైళ్ల సరిహద్దు అమెరికా లోని కాలిఫోర్నియా, ఆరిజోనా, కొత్త మెక్సికో, టెక్సాస్‌ల మీదుగా కొనసాగు తున్నది. నోగేల్స్ ప్రాంతం, ఆరిజోనా ప్రాంతాలను వేరుచేస్తూ ఇది ఉంది. రెండుదేశాలకు నైరుతి ప్రాంతంలో ఉన్న ఈ సరిహద్దుపైనే ప్రస్తుతం డొనాల్డ్‌ట్రంప్ ప్రత్యేక శ్రద్ధ చూపిస్తున్నారు. అత్యధికంగా మాదక ద్రవ్యాలకు పెట్టిందిపేరుగా ఇది నిలుస్తోంది. అంతర్జాతీయ స్మగ్లర్లు సైతం దీన్నే కేంద్రం చేసుకుని ప్రపంచ దేశాలకు ఎగుమతులు చేస్తున్నారు.

ఈ సరిహద్దు మధ్యలోనే రియోగ్రాండే సహజవనరుల నది ఉంది. కొంతభాగం గోడలతోను, మరికొంత భాగం కంచెతోను,



మరికొంత సహజ వనరుల పరంగాను సరిహద్దులను నిర్ణయించే అమెరికా మెక్సికో సరిహద్దు ఇపుడు ప్రపంచ వ్యాప్తంగా చర్చనీయాంశం అయింది. ఒక్క అమెరికాకే కాకుండా ప్రపంచంలోని అభివృద్ధిచెందిన దేశాలన్నిటా కూడా అంతర్గత భద్రత, అక్రమ వలసలు, ఇతర ఉగ్రవాద శక్తుల చొరబాట్ల వల్ల దేశ ఆర్థికాభివృద్ధి కుంటుపడుతుందన్న భావన ఎక్కువ వ్యక్తం అవుతోంది. అందుకోసమే సరిహద్దుల వెంబడి ఈ భారీ ఎత్తున గోడలు, లేక కంచెనిర్మాణాలు చేపట్టాయి. అంతేకాకుండా నిరంతర గస్తీకోసం భారీ ఎత్తున సరిహద్దు భద్రతా దళాలను ఏర్పాటుచేసుకుంటున్నాయి.

కూలగొట్టిన బెర్లిన్ గోడకంటే నాలుగు రెట్లు ఎక్కువ విస్తీర్ణాల్లో ఈ సరిహద్దు గోడలు నిర్మిస్తున్నాయి. ఆయా దేశాలనుంచి శరణార్థులను కూడా మరింత ఎక్కువ సంఖ్యలో


నోగేల్స్ - అరిజోనా సరిహద్దు..



బెర్లిన్ గోడ

వస్తుండటాన్ని ఈ దేశాలు తిరస్కరిస్తున్నాయి. ప్రస్తుతం ప్రపంచంలోని మూడొంతుల దేశాలు తమ తమ సరిహద్దు దేశాల వెంబడి గోడలు నిర్మించాయి. వాటిలో ఇజ్రాయిల్ పాలస్తీనా సరిహద్దు గోడ, భారత్ బంగ్లాదేశ్ 2500 మైళ్ల సరిహద్దు గోడ, మొరాకోలోని ఇసుక తిన్నెల వెంబడి ఉన్న సరిహద్దులు కీలకమైనవనే చెప్పాలి. పాతికేళ్ల క్రితమే బెర్లిన్ గోడను కూలగొట్టే నాటికి ప్రపంచంలో 16 సరిహద్దు గోడలు లేదా కంచెలను నిర్మించారు. క్యూబెక్‌వర్సిటీ గణాంకాల ప్రకారం ప్రస్తుతం ప్రపంచంలోని 65 దేశాలు గోడలు, లేదా కంచెలను సరిహద్దుల వెంబడి నిర్మాణం పూర్తిచేసుకున్నాయి. అలాగే మొరాకో పశ్చిమ సహారా సరిహద్దులో 1700 మైళ్ల మేర ఇసుక తిన్నెల రూపంలో సరిహద్దును ఏర్పాటుచేసాయి.

ఇక సౌదీ అరేబియా ఇరాక్‌లమధ్య కూడా ఐసిస్ ఉగ్రవాదుల చొరబాట్లు ఎక్కువ ఉన్నట్లు అంచనావేయడంతో 560 మైళ్ల కంచెను నిర్మించింది. అలాగే ఇజ్రాయిల్ వెస్ట్‌బ్యాంక్ మధ్యకూడా 2002లోనే పాలస్తీనా కల్లోలితవాదులనుంచి రక్షణకోసం ఈ గోడను నిర్మించింది. టర్కీ సిరియా దేశాలమధ్యకూడా 500 మైళ్ల విస్తీర్ణంతో సరిహద్దు భద్రతా కవచం నిర్మించింది. ఇందుకు సిరియానుంచి ఉగ్ర వాదులు, ఐసిసి ఉగ్రవాదుల చొరబాట్లే కారణమని తేలింది. అలాగే ఇండో బంగ్లా సరిహద్దు కూడా అతిపెద్దదేనని చెప్పాలి. 2500 కి.మీ. మేర ఈ సరిహద్దు కంచె నిర్మాణం జరిగింది. హంగెరీ సెర్బియా దేశాల మధ్య కూడా 110 మైళ్లు లేదా 177 కి.మీ. కంచెను నిర్మించింది. సెర్బియా వెంబడి ఉన్న ఈ సరిహద్దు కంచె ఎక్కువగా ఉగ్రవాద మూకలను అరికట్టడమే లక్ష్యంగా నిర్మించింది. గ్రీస్ టర్కీ దేశాల

# చారిత్రాత్మక చైనా గోడ...

అత్యంత చారిత్రాత్మకమైన చైనా గ్రేట్‌వాల్ పొడవు 21,196.18 కి.మీ...దీని చరిత్ర 2300 సంవత్సరాలకు పైబడి ఉందని సాక్ష్యాలు చెపుతున్నాయి. ఈ గోడను విభిన్న ప్రాంతాల్లో విభిన్న రాష్ట్రాల్లో విభిన్న వంశాల రాజులు నిర్మించారని చరిత్ర చెపుతోంది. చైనా మొదటి చక్రవర్తి క్విన్ ఈ గోడను నిర్మించారని చెపుతున్నా, వాస్తవంగా ఆయన తాను జయించిన ప్రాంతాల్లోని గోడలన్నింటినీ కలిపారని మాత్రమే అంటారు. ఝౌ వంశరాజులు అనువంశీకులు రాష్ట్రాల్లోని సరిహద్దు గోడలను నిర్మించారని చెపుతున్నారు. తదనంతరం హ్యాన్ వంశస్తులు ఆ తర్వాత మింగ్ వంశరాజులు ఈ గోడను పూర్తిచేశారు. చైనాపై దండయాత్రలను కట్టడి చేయటానికి, సిల్క్‌రోడ్ వాణిజ్య పరిరక్షణకోసం ఈ గోడను నిర్మించినట్లు చెపుతారు. సైనికులు, రైతులు, తిరుగుబాటుదారులు ..అంతా కలిసి ఈ గోడను నిర్మించారు. రాళ్లు, ఇటుక, ఇసుక, మట్టితో మాత్రమే నిర్మించారు. తాళ్లసాయంతోను, లాగుడు బళ్లలోను, మేకలను కట్టిన బళ్లలోను నిర్మాణసామగ్రిని రవాణా చేసారు. అనేకచోట్ల కోట బురుజుల తరహాలో శత్రుకదలికలను కనిపెట్టేందుకు సైతం బురుజుల మాదిరిగా నిర్మించారు. అయితే సహజ సిద్ధంగా వస్తున్న కోత, మానవాళి విధ్వంసం వంటి వాటివల్ల రెండు వేల కి.మీ. మింగ్‌గ్రేట్‌వాల్ కోతకు గురయినట్లు చెపుతారు. రోజుకు 70వేల మందికి పైగా సందర్శకులు ఈ గోడను చూసేందుకు వస్తుంటారు. ఎక్కువగా బాదలింగ్ సెక్షన్‌లో విపరీతమైన రద్దీ ఉంటుంది. రద్దీసీజన్లలో 2001లో ఒకరోజు 6.30 కోట్లమంది సందర్శకులు వచ్చినట్లు సమాచారం. యునెస్కో చారిత్రక కట్టడాల్లో గ్రేట్‌వాల్ ఆఫ్ చైనాను సువర్ణాక్షరాలతో లిఖించారు. అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా, బ్రిటన్ ప్రధాని డేవిడ్ కేమరూన్, రష్యా అధ్యక్షుడు వ్లాదిమిర్ పుతిన్ వంటి ప్రముఖులు మొత్తంగా 300మందికిపైగా గ్రేట్‌వాల్‌ను సందర్శించారు. అలాగే డీగో మరడోనా, మైఖేల్ జోర్డాన్, కోబే బ్రైయంట్, లెబ్రబన్ జేమ్స్, షాక్విల్లీ ఓనీల్ వంటి క్రీడాకారులు సైతం ఉన్నారు. గ్రేట్‌వాల్‌లోని బదాలియాంగ్, జుయోంగ్ య్యుయాన్, హువాన్ గువా చెంగ్, జియాన్‌ఖోవు, ముతియాన్యు, గుబీకోవు, జిన్‌షాన్లింగ్, సిమాతాయ్ వంటి ప్రాంతాలకు ఎక్కువగా సందర్శకులు వస్తుంటారని చైనా పర్యాటకశాఖ చెపుతోంది.



సరిహద్దులో ఏడుమైళ్ల ఎవారాస్ గోడను నిర్మించింది. గ్రీస్‌నుంచి యూరోప్‌లోనికి వెళ్లేందుకు ఈ సరిహద్దును వినియోగిస్తున్నట్లు గుర్తించిన గ్రీస్ ఈ కంచెను నిర్మించింది. తాజాగా బెల్‌ఫాస్ట్ వద్ద కూడా 99 మైళ్లమేర పీస్‌లేన్ పేరిట మతపరమైన ఘర్షణలను నివారించేందుకు సరిహద్దు గోడను నిర్మించింది. అలాగే స్పెయిన్ మొరాకో దేశాలమధ్య స్యూటా- మెలిల్లాల మధ్య పటిష్టమైన గోడ కొంతభాగం, మరికొంత భాగం కంచెను నిర్మించింది. 1974లో టర్కీ


ఇజ్రాయిల్ -పాలస్తీనా సరిహద్దు గోడ

సైప్రస్‌పై దండయాత్ర చేసినప్పటి నుంచి ఈ దేశం టర్కీనుంచి వేరుపడింది. టర్కీ ప్రాంతంనుంచి గ్రీక్ సైప్రియట్ భాగాలను వేరుచేస్తూ గోడలు, కంచెలు నిర్మించారు. అలాగే ఉత్తర ఐర్లాండ్‌నుంచి బెల్‌ఫాస్ట్‌ను వేరుచేస్తూ పీస్‌వాల్స్ నిర్మించింది ఐర్లాండ్‌లో ఉండాలనుకున్న కొందరు జాతీయ వాదులు, ఉత్తర ఐర్లాండ్ వాసులు బ్రిటన్‌లో కొనసాగాలనుకునేవారి మధ్య పొడసూపిన విభేదాలతో 99 మైళ్ల దూరం మేర ఈ గోడలు నిర్మించారు.

ఇక పాలస్తీనా, ఇజ్రాయిల్ మధ్య జరిగిన భారీపోరుకు నిదర్శనమే ఈ గోడ నిర్మాణం. వెస్ట్‌బ్యాంక్ గాజా లోనికి ప్రవేశించేందుకు అడ్డగించి 30 మైళ్ల దూరం మేర గోడను నిర్మించారు. 1994లోనే ఈ గోడ నిర్మాణం ప్రారంభించారు. 2002లో ఇజ్రాయిల్ కూడా వెస్ట్‌బ్యాంక్ నుంచి వేరుచేసేందుకు గోడనిర్మాణం ప్రారంభించింది. 420 మైళ్ల మేర ఈ గోడను నిర్మించింది. 1953లో ఉత్తర, దక్షిణ కొరియాలను వేరుపడిన తర్వాత 2200 అడుగుల దూరం లేదా 2.5 మైళ్ల దూరం మేర ఎవ్వరూ తిరగని ప్రాంతంగా నిర్ణయించారు. డిఎంజడ్ ప్రాంతం వెంబడి 1970లో పటిష్టమైన గోడను నిర్మించింది దక్షిణకొరియా.

అలాగే హంగేరీనుంచి ఎక్కువగా వస్తున్న వలసలను నివారించేందుకు యూరోపియన్ కూటమి సరిహద్దుగోడలను నిర్మించింది. హంగెరీ నుంచి రోజుకు సుమారు వెయ్యిమంది శరణార్థులు అక్రమంగా చొరబాట్లకు పాల్పడుతున్నట్లు తేలింది. సెర్బియా దక్షిణ సరిహద్దు వెంబడి గోడ నిర్మించింది. అలాగే 13 అడుగుల ఎత్తున కంచెను కూడా ఏర్పాటుచేసింది. హంగెరీలోనికి సుమారు 80వేల మంది అక్రమంగా చొరబడుతున్నట్లు అంచనా. ఎక్కువమంది ఇరాక్, ఆఫ్గనిస్తాన్, సిరియాల నుంచే వస్తున్నారు. ఎక్కువ మంది సంపన్న దేశాల వైపునకు మళ్లుతున్నారు. ఐరోపా కూటమిలోని జర్మనీలాంటి దేశాలకు మరింతగా వస్తున్నారు. అలాగే బల్గేరియా దేశం కూడా టర్కీతో ఉన్న సరిహద్దును మరింత పటిష్టం చేస్తున్నట్లు ప్రకటించింది. ఇప్పటికే బ్రిటన్ కూడా ఫ్రాన్స్‌లోని సాలైయాస్‌వద్ద రెండుమైళ్ల దూరం మేర కంచె నిర్మాణం తప్పదని హెచ్చరించింది. ట్రక్కులు, ఇతర రవాణా వాహనాల సాయంతో బ్రిటన్‌లోనికి ఈ సరిహద్దుగుండా శరణార్థులు చొరబడుతున్నట్లు అంచనా.

ఇక భారత్ పాకిస్తాన్ సరిహద్దువెంబడి జరుగుతున్న ఉగ్రమూకల చొరబాట్లు ప్రత్యేకించి చెప్పనవసరంలేదు. జమ్ముకాశ్మీర్, రాజస్థాన్, పంజాబ్‌లలో ఉన్న సరిహద్దు వెంబడి ప్రవేశించి దేశాన్ని అస్థిరపరచాలన్న కుయుక్తులు, కుట్రలు ఇప్పటికీ చేస్తూనే ఉంది. అయితే భారత్ కూడా అందుకు తగినట్లుగానే జవాబు ఇస్తోంది.

ఇక బంగ్లాదేశ్ సరిహద్దు 3268 కి.మీ. దూరం ఉంది. అలాగే ఇండో బర్మా సరిహద్దు కూడా 1624 కి.మీ. ఉంది. భారత్, కాశ్మీర్ సరిహద్దు 550 కి.మీ. దూరం ఉంది. ఈ ప్రాంతం మొత్తం కంచెను నిర్మించారు. ఇక ఇరాన్ పాకిస్తాన్ సరిహద్దులో రెండు దేశాలు అక్రమ వ్యాపారం, స్మగ్లింగ్‌ను అరికట్టేందుకు 700 కి.మీ.మేర కంచెను నిర్మించాయి. ఇక కువైట్ ఇరాక్ మధ్య 1991లోనే 193 కి.మీ. మేర వివాదాస్పద జోన్‌గా నిర్ణయించి గోడలు నిర్మించాయి. ఇక పాకిస్తాన్ ఆఫ్గనిస్తాన్ దేశాలమధ్య 2400 కి.మీ. మేర కంచెను నిర్మించాలని పాకిస్థాన్ పతిపాదించింది. ఇక సౌదీ ఎమెన్ సరిహద్దులో 2004 లోనే 75 కి.మీ. మేర సరిహద్దు గోడ నిర్మాణానికి ప్రతిపాదించారు. సౌదీ అరేబియా ఇరాక్ సరిహద్దుల్లో 2014లో 900 కి.మీ. మేర సరిహద్దు కంచెను నిర్మించాయి.

ఇక తుర్కుమెనిస్తాన్, ఉజ్బెకిస్తాన్ దేశాల మధ్య రెండుదేశాలు సంయుక్తంగా అక్రమవలసల నివారణకు 1700 కి.మీ., ఉక్రెయిన్ రష్యా సరిహద్దు వెంబడి రెండుదేశాలు కలిసి రెండువేల కి.మీ. గోడలు నిర్మించాలని ఒప్పందం చేసుకున్నాయి.

ఉక్రెయిన్ రష్యాలమధ్య అక్రమ ఆయుధ స్మగ్లింగ్, వివాదాస్పద జోన్‌ను నిర్ణయించి కంచెను నిర్మించాయి. ఇక యుఎఇ ఎమన్ సరిహద్దుల్లో 410 కి.మీ.మేర కంచె నిర్మాణంలో ఉంది.

ఇక ప్రపంచంలోని వివిధ దేశాలను పరిశీలిస్తే అర్జంటైనా పరాగ్వే దేశాల మధ్య అక్రమ వలసలు, చొరబాట్లు, అక్రమ వాణిజ్యం, మాదకద్రవ్యాల స్మగ్లింగ్ నిరోధానికి గోడ నిర్మిస్తోంది. మెలిజ్ గాటెమలా ప్రాంతంలో కూడా వలస నిరోధానికి గోడ నిర్మాణానికి ఒప్పందం జరిగింది. ఇక బోట్స్‌వానా జింబాబ్వే దేశాలమధ్య 2003లో 500 మైళ్ల దూరం వలసల నిరోధించాలని నిర్ణయించి గోడను నిర్మిస్తోంది. బ్రూనే లింబాంగ్ దేశాలమధ్య రెండుదేశాలు కలిసి 20 మైళ్ల దూరంపాటు అక్రమ వలసల కట్టడికి 2005లోనే గోడను నిర్మించాలని తలపెట్టాయి.


ద.కొరియా సరిహద్దు

ఇక బల్గేరియా టర్కీ 2014లో 30 మైళ్లపాటు నిర్మించింది. ఇక స్యూటా సరిహద్దు కంచెను స్పెయిన్‌దేశం 2001లో ఎనిమిదిమైళ్ల దూరం పాటు నిర్మించింది. చైనా హాంకాంగ్ మధ్య 1960లోనే 32 మైళ్లపాటు అక్రమ చొరబాట్లను నిరోధించేందుకు కంచె నిర్మించింది. అలాగే కోస్టారికా నికరాగ్వా దేశాలమధ్య కోస్టారికా వలసల కట్టడికి కంచె లేదా గోడనిర్మాణానికి కోస్టారికా ప్రతిపాదించింది. ఇక చైనా కొరియా సరిహద్దు కంచె నిర్మాణానికి రెండుదేశాలు అంగీకరించాయి. మొత్తం 1416 కి.మీ.పాటు ఈ గోడను నిర్మిస్తున్నారు. ఈజిప్ట్ గాజా సరిహద్దులో కూడా 1979నుంచి నిర్మాణం జరుగుతున్నది. ఎస్టోనియా రష్యా సరిహద్దు కంచెను రెండుదేశాలు ఉభయతారకంగా నిర్మించాయి. 106-108 శతాబ్దాల్లోనే నిర్మించింది. ఇక మెసడోనియా గ్రీస్ సరిహద్దులమధ్య మెసడోనియా 2015లోనే 30 మైళ్లపాటు నిర్మించింది. మలేసియా థాయిలాండ్ సరిహద్దును

రెండుదేశాలు సమ్మతితో ఉగ్రవాద నిరోధమే లక్ష్యంగా సరిహద్దు కంచెను నిర్మించాయి. హంగెరీ సెర్బియా దేశాలమధ్య 175 మైళ్లు, హంగెరీ క్రోయేషియా సరిహద్దుల్లో 41 మైళ్ల మేర వలసల కట్టడికి గోడలను నిర్మించాయి. ఇక ఉత్తర, దక్షిణ కొరియాల మధ్య 248 కి.మీ.మేర వివాదాస్పద జోన్‌గా నిర్ధారించి వేరుచేసారు. కజకిస్తాన్, ఉజ్బెకిస్తాన్ సరిహద్దులవెంబడి 2006లో 45 కి.మీ. డ్రగ్స్ నివారణకు కంచెను నిర్మించాల్సి వచ్చింది. దక్షిణాఫ్రికా మొజాంబిక్‌ల మధ్య కృగర్ నేషనల్‌పార్క్ వద్ద 120 కి.మీ. నిడివిలో అక్రమ జొరబాట్లను నివారించేందుకు గోడనిర్మించారు. అలాగే ఉజ్బెకిస్తాన్ ఆఫ్గనిస్తాన్ దేశాలమధ్య 2001లోనే 209 కిలోమీటర్లమేర సరిహద్దును పటిష్టం చేయాలని నిర్ణయించాయి. ఉజ్బెకిస్తాన్ కిర్గిజ్‌స్థాన్ సరిహద్దుల్లో 1999లోనే 870 కి.మీ. మేర సరిహద్దును నిర్మించింది. ఈదేశాలన్నీ తమతమ అంతర్గత భద్రతను పెంపొందించుకునే లక్ష్యంతోను, అదే సమయంలో అక్రమ చొరబాట్లతో అస్థిరతకు తావిచ్చే అంశాలను కట్టడి చేయాలన్న లక్ష్యంతోను గోడ నిర్మాణం చేపడుతున్నాయి. అంతేకాకుండా తరచూ మాదక ద్రవ్యాల అక్రమరవాణా జోరుగా సాగుతున్న దేశాలమధ్య దాన్ని నిలువరించేందుకు సరిహద్దులను పటిష్టం చేసుకోవాలని చూస్తున్నాయి. ఈ కార్యకలాపాల్లో ముఖ్యంగా అక్రమ వలసల కారణంగానే తమ దేశీయులకు ఉపాధి తగ్గుతున్నదన్న అపోహల్లో ఆయా దేశాలున్నాయి. తమ సహజవనరులను కూడా పొరుగుదేశాలు దోపిడీ చేస్తున్నాయన్న అభియోగాలు కూడా లేకపోలేదు. అందువల్లనే ప్రపంచంలోని మొత్తం 65 దేశాలు తమతమ సరిహద్దు దేశాల వెంబడి ముళ్లకంచెలను నిర్మించడమో లేక పటిష్టమైన గోడను నిర్మించుకోవడమో చేస్తున్నాయి.


ఇండియా-చైనా-టిబెట్ బార్డర్

## చైనా సరిహద్దు..తెగని వివాదం!

సుదీర్ఘ చరిత్ర ఉన్న భారత్ చైనా సరిహద్దు వివాదం ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది. దక్షిణ టిబెట్ ప్రాంతంలోని రెండు వేల కి.మీ. ప్రాంతం తమదేనని చెపుతున్న చైనా ఇప్పటికీ చొరబాట్లను తరచూ ప్రోత్సహిస్తూనే ఉంది. సరిహద్దు ప్రాంతంలో ఉద్రిక్తతలు చోటుచేసుకుంటున్నా మితిమీరిన ఘర్షణలకు తావులేకపోవడం కొంత ఊరటనిచ్చే విషయం. పొరుగునే టిబెట్ ఆక్రమిత చైనా ప్రాంతం ఉన్నందున తరచూ రాకపోకలు సాగిస్తూనే ఉంది. అరుణాచల్‌ప్రదేశ్‌లోని తూర్పు ప్రాంతంలో దక్షిణ టిబెట్ సమీపంలో ఉన్న ఈ ప్రాంతం తమదేనని వాదిస్తోంది వాస్తవాధీనరేఖ వెంబడి అక్సాయ్ చిన్‌తో సహా చైనా 1962 యుద్ధంలోనే ఆక్రమించేసింది. మొత్తం 3488 కి.మీ. మేర ఉన్న వాస్తవాధీనరేఖ వెంబడి సుహృద్భావ వాతావరణం కోసం ఇప్పటికీ భారత్, చైనాతో సంప్రదింపులు జరుపుతూనే ఉంది. 19 విడతలుగా జరిగిన సరిహద్దు వివాదాల సంప్రదింపులు ఇప్పటికీ జరుగుతూనే ఉన్నాయని చెప్పకతప్పదు. లడక్ చుమార్ ప్రాంతంలో ఇప్పటికీ ఇరువైపులా సైన్యాలు కాలుదువ్వుతూనే ఉన్నాయి. వాస్తవాధీనరేఖవద్ద దౌలత్ బెగ్ ఓల్దివద్ద గత ఏడాది చైనా సైనికులు చొరబడటంతో ఉద్రిక్తతలు చోటుచేసుకున్న సంగతి తెలిసిందే.


ఇండో-పాక్ సరిహద్దు

చైనావైపునుంచి వెయ్యిమంది, భారత్‌వైపునుంచి 1500 మందికిపైగా మొహరించుకున్న సంఘటన ఇరువైపులా కలవరం కలిగించింది. చుమార్ ప్రాంతానికి సుమారు 500 మంది సైనికులు చొచ్చుకు రావడమే ఈ వివాదానికి కారణం అయింది.

## రగులుతున్న భారత్- పాక్ రావణకాష్టం

ఇక భారత్ పాకిస్తాన్ సరిహద్దుకు సంబంధించిమొత్తం 3323 కి.మీ.పరిధి ఉంది. వాస్తవాధీనరేఖ జమ్ము కాశ్మీర్ సెక్టార్‌నుంచి గుజరాత్, రాజస్థాన్, పంజాబ్ రాష్ట్రాల్లో కూడా పాకిస్తాన్ సరిహద్దు ఉంది. పంజాబ్ సరిహద్దులో 461 కిలోమీటర్ల మేర కంచెను నిర్మించింది. 1999లో 1048 కిలోమీటర్లు కంచె వేసింది. గుజరాత్ సెక్టార్‌లో 340 కి.మీ. మేర సరిహద్దు రోడ్లను నిర్మించింది. అలాగే మరో 137 కి.మీ.లింకురోడ్లు కూడా నిర్మించింది. ఇప్పటికీ జమ్ముకాశ్మీర్‌లోని వాస్తవాధీన రేఖ వెంబడి తీవ్రస్థాయి ఉద్రిక్తతలు చోటుచేసుకుంటున్నాయి. సైన్యమే లక్ష్యంగా ఉగ్రమూకలను పొరుగుదేశం భారత్‌పైకి ప్రేరేపిస్తోంది. జమ్ముకాశ్మీర్ రంగంలో సాయుధ సిబ్బంది కంచెను కోసి చొరబాట్లను ప్రోత్సహిస్తున్నట్లు భోగట్టా.

అంతేకాకుండా గుజరాత్‌లోని కచ్ ప్రాంతంలో 93 కి.మీ. మేర కంచెనిర్మాణం జరగలేదు. అలాగే పంజాబ్‌లోని ఫిరోజ్‌పూర్ సెక్టార్‌లో 23,380 కి.మీ. కంచెను మార్చాలని సరిహద్దు భద్రతా దళం సిఫారసు చేసింది. మొత్తం 462 కి.మీ. మేర కంచెవేసారు. నదీప్రాంతాలు మినహా ఇతర ప్రాంతాల్లో కంచెనిర్మాణం జరిగింది. 1048 కి.మీ.లో కంచెతో పాటు ఫ్లడ్‌లైట్లు, 1023 కి.మీ. మేర పూర్తిచేసారు. జమ్ముప్రాంతంలో 175.50 కి.మీ. కంచె ఫ్లడ్‌లైట్లను ఏర్పాటుచేసారు.

మొత్తంగాచూస్తే భారత్ ఏడుదేశాలతో సరిహద్దును కలిగి ఉంది. భూటాన్, చైనా, బంగ్లాదేశ్, మైన్మార్, శ్రీలంక, పాకిస్తాన్, నేపాల్ దేశాలతో సరిహద్దులు కలిగి ఉంది. అన్నింటిలో కెల్లా చైనా, పాకిస్తాన్ సరిహద్దులపైనే భారత్ ప్రత్యేక భద్రతా పరిరక్షణ చర్యలు చేపట్టింది. మైన్మార్ దేశపరంగా అరుణాచల్‌ప్రదేశ్, నాగాలాండ్, మిజోరమ్, మణిపూర్ రాష్ట్రాలతో సరిహద్దులు కలిగి ఉంది. పూర్వం బర్మాగా పిలుచుకునే దేశం మైన్మార్‌గా మారినసంగతి తెలిసిందే. ఇక నేపాల్ దేశ సరిహద్దు భారత్‌లోని ఉత్తరాఖండ్, ఈశాన్యంలోని సిక్కిం, ఉత్తర ప్రదేశ్, బీహార్ రాష్ట్రాలతో సరిహద్దులు కలిగి ఉంది.

ఇక భారత్, శ్రీలంకల మధ్య సరిహద్దు అతితక్కువ సరిహద్దు ఉన్న ప్రాంతంగా నెలకొంది. కేవలం 100 మీటర్ల అతితక్కువ సరిహద్దు ఉంది. ఆడమ్స్ బ్రిడ్జ్‌గా చెపుతున్న వంతెన సాయంతో ఈ రెండు దేశాలు ఒకటవుతున్నాయి. ఇక భారత్ భూటాన్ అంతర్జాతీయ సరిహద్దు 699 కి.మీ. ఉంది. భూటాన్ సిక్కిం, పశ్చిమబెంగాల్, అస్సాం, అరుణాచల్‌ప్రదేశ్ రాష్ట్రాలతో సరిహద్దు కలిగి ఉంది. ఇక పక్కనే ఉన్న బంగ్లాదేశ్ పరిస్థితి ప్రత్యేకించి వివరించాల్సిన పనిలేదు. త్రిపుర, నాగాలాండ్, మిజోరమ్, మేఘాలయ, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలవెంబడి సరిహద్దు పటిష్టమైన భద్రతతో కొనసాగుతోంది. ■

# జీవ పరిణామ సిద్ధాంత ప్రతిపాదకుడు

## నేడు డార్విన్ డే



అనంతవిశ్వంలో ఎన్నో విశ్వ రహస్యాలు దాగి ఉన్నాయి. ఎందరో ప్రఖ్యాత శాస్త్రవేత్తలు తమ జీవితకాలాన్ని పరిశోధనలకే అంకితం చేసి, ఆ రహస్యాలను ఛేదించి, కొత్త అంశాలను మనకు వెల్లడిస్తూనే ఉన్నారు. దీర్ఘకాల పరిశోధన, సునిశిత పరిశీలన, శ్రద్ధ, ఏకాగ్రత, కనుగొనితీరాలనే కసి శాస్త్రవేత్తకు ఉంటేనే నూతన అంశాల ఆవిష్కరణ సాధ్యమవుతుంది. ఎంతోకాలంగా ఎందరో శాస్త్రవేత్తలు వృక్ష, భూగర్భ, జంతు శాస్త్ర పరిశోధనలు చేస్తూనే ఉన్నారు. ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్తలలో చార్లెస్ డార్విన్‌ను ముఖ్యంగా ప్రస్తావించుకోవాలి.

డార్విన్ ప్రకృతి శాస్త్రవేత్త, ప్రకృతివాది. పరిణామ సిద్ధాంతం (థియరీ ఆఫ్ ఎవల్యూషన్) అందించిన మేధావి. ఈయన పూర్తిపేరు చార్లెస్ రాబర్ట్ డార్విన్. ఇంగ్లాండ్‌లోని ష్రాస్‌బరీ అనే ఓ చిన్ని పట్టణంలో 1809 ఫిబ్రవరి 12న జన్మించాడు. తండ్రి ఆర్.డబ్ల్యు.డార్విన్. తల్లి సుసన్నా .ఆరుగురి సంతానంలో చార్లెస్ డార్విన్ ఐదవ వాడు. తాతగారు ఎరాస్‌మస్ డార్విన్ కూడా ప్రఖ్యాత వృక్షశాస్త్రవేత్త. డార్విన్ 8వ ఏటనే తల్లి మరణించింది. అతడికి బాల్యం నుంచీ ప్రకృతిశోధన ఎక్కువ ఆసక్తికరంగా ఉండేది. 16వ ఏట మెడిసిన్ చదవటంకోసం ఎడిన్‌బర్గ్ విశ్వవిద్యాలయంలో చేరాడు. ఆ కాలంలో మత్తుమందు లేకుండానే ఆపరేషన్లు నిర్వహించేవారు. ఆపరేషన్ల సమయంలో రోగులు పడే బాధ చూడలేక డార్విన్ మెడిసిన్ చదువుకు స్వస్తిచెప్పాడు. 1828లో కేంబ్రిడ్జికి వెళ్లి థియాలజీ అధ్యయనం చేశాడు. ఏదో ఒక డిగ్రీ సంపాదించాలన్న తండ్రి కోరికపై కేంబ్రిడ్జిలో తత్త్వశాస్త్ర అధ్యయనంలో చేరికూడా కొనసాగలేక పోయాడు. అక్కడి ప్రొఫెసర్ ఒకసారి అతడికి 'బీగల్' అనే ఓ నౌక కెప్టెన్‌కి పరిచయం చేశాడు. ఆ కెప్టెన్ పేరు రాబర్ట్ ఫిట్జ్‌రాయ్. వివిధ దేశాల్లో, దీవుల్లో ఉండే జీవుల పరిశీలనకు అవకాశం ఉంటుందనే ఆలోచనతో డార్విన్ తన తండ్రి కాదంటున్నా వినకుండా ఆ ఓడలో ఐదేళ్ల పాటు కెప్టెన్‌తో పాటు వివిధ దేశాలు పర్యటించాడు. ఈ ప్రయాణంలో డార్విన్ శిలాజాలు, పక్షులు, ప్రకృతి జీవ జాతులను సేకరించాడు. ఈ ప్రయాణం డార్విన్‌కు వృక్ష, భూగర్భ, జంతుశాస్త్ర పరిశోధనలకు పునాది అయింది. దక్షిణ అమెరికాలో ముఖ్యంగా పసిఫిక్, గాలాపాగోస్, ఆర్చిపెలాగో ప్రాంతాలు అతణ్ని ఎంతగానో ఆకర్షించాయి. ఇంగ్లాండుకు తిరిగి వచ్చి 'జర్నల్ ఆఫ్ రీసెర్చర్స్'లో తన పరిశోధనాంశాన్ని ప్రచురించాడు. 150 సంవత్సరాలకు పూర్వం రాసిన ఈ గ్రంథం ఇప్పటికీ ప్రామాణికంగా నిలిచింది. జీవుల్ని ఏదో అతీతశక్తి ఏక కాలంలో సృష్టించ లేదని, అది వివిధ దశల్లో నేచురల్ సెలెక్షన్ ద్వారా పరిణామం చెందాయని డార్విన్ సిద్ధాంతం చెపుతుంది. ప్రకృతిలో జీవ జాతులు అన్నీ ఏకకాలంలో రూపొందినట్టు ఎంతోకాలంనుండి నమ్ముతూ వచ్చిన ప్రజానీకానికి అదంతా వాస్తవం కాదని, ఒక మాతృక నుంచి సకల జీవరాశులు క్రమానుగతంగా పరిణామం చెందుతూ ఏర్పడ్డాయని ఈ చర్య అనంతంగా కొనసాగుతూ ఉంటుందని ప్రప్రథమంగా వివరించినవాడు డార్విన్. వానరుని నుంచి నర వానరుడు, నర వానరుని నుంచి నరుడు పరిణామపరంగా ఉద్భవించాడని తెలిపి సంచలనం రేపిన ప్రకృతి శాస్త్రవేత్త చార్లెస్ డార్విన్. సరిగ్గా ఈ సమయంలోనే ఆల్ఫ్రెడ్ రస్సెల్ వాలరెస్ అనే మరో శాస్త్రవేత్త కూడా డార్విన్ చెప్పిన సిద్ధాంతాన్నే వెలువరించాడు. ఆయన డార్విన్‌కు ఓ లేఖ కూడా రాశాడు. 1858లో వీరిద్దరూ సంయుక్తంగా ఒక పరిశోధనా పత్రాన్ని సమర్పించారు. 1859లో ప్రపంచ ప్రసిద్ధిచెందిన 'ది ఆరిజన్ ఆఫ్ స్పీసిస్ ఆఫ్ నేచురల్ సెలెక్షన్' పుస్తకాన్ని చార్లెస్ డార్విన్ వెలువరించాడు. ఈ పుస్తకం విడుదలైన రోజునే అన్ని ప్రతులూ అమ్ముడుపోయి, సరికొత్త రికార్డును సృష్టించింది. జీవులలోని వైవిధ్యేతరాలు మారుతూపోగా కొత్త జాతుల ఉత్పన్నానికి మూలాధారాలు అవుతాయనేది సంక్షిప్తంగా డార్విన్ పరిణామ సిద్ధాంతవాదం.

అయితే సృష్టి సిద్ధాంతవాదులు ఈయన వాదనను సమర్థించరు. చార్లెస్ డార్విన్ సొంత దేశమైన బ్రిటన్‌లో డార్వినిజం ఎన్నో ప్రశంసలు అందుకుంది. డార్వినిజం ప్రపంచంలోని ఎంతోమంది భౌతిక శాస్త్రవేత్తలని, జీవ శాస్త్రవేత్తలని ప్రభావితం చేసి ఆధునిక భౌతిక శాస్త్ర విజ్ఞానాన్ని ఎన్నో మలుపులు తిప్పింది.

కొన్ని క్రైస్తవ, ఇస్లామిక్ దేశాల్లో డార్వినిజం వివాదాస్పదమైంది. కొన్ని ఇస్లామిక్ దేశాలు ఈ సిద్ధాంతాన్ని నిషేధించాయి. 1868లో డార్విన్..'వేరియేషన్ ఆఫ్ ఆనిమల్స్ అండ్ ప్లాంట్స్' అనే మరో పుస్తకాన్ని ప్రచురించాడు. ఇంసెక్టివోరస్ ప్లాంట్స్, డిసెంట్ ఆఫ్ మ్యాన్, ది ఫార్మేషన్ ఆఫ్ వెజిటబుల్ మౌల్డ్ త్రూ ది యాక్షన్ ఆఫ్ వర్మ్స్' లాంటి పుస్తకాలెన్నో రచించాడు. 1882 ఏప్రిల్ 19వ తేదీన డార్విన్ డౌన్‌టౌన్ లండన్‌లో కన్నుమూశాడు.

సర్ ఐజాక్ న్యూటన్ సమాధి దగ్గరే ఈయన కూడా సమాధిచేయబడటం ఆశ్చర్యకరమైన అంశం. డార్విన్ థియరీ ఆఫ్ ఎవల్యూషన్ ఆధారంగా డిఎన్ఎ పరిశోధనలు కొనసాగాయి. అయినప్పటికీ సృష్టివాదులలో సంఘర్షణ,వివాదాన్ని రేపింది. దైవదత్తంగా లభించిన పరిశోధనా పటిమతో ఆయన ప్రతిపాదించిన ప్రకృతివరణ సిద్ధాంతం, ఈ అంశమై తొలినాళ్ల పరిశోధనగా ఎప్పటికీ నిలిచే ఉంటుంది.

-ఎమ్.రామలక్ష్మి

## కృతి

## నవలంతా నవ్వుల పండుగే!



1970, 1980 ప్రాంతంలో తన కథలతో, నవలలతో పాఠకులను ఉర్రూతలూగించిన రచయిత్రి మన్నెం శారద. ఆమె రచించిన తాజా హాస్య నవల 'మహారాజశ్రీ మామ్మగారు'. మెలోడ్రామాతో, సున్నితమైన హాస్య మేళవింపుతో ఆకట్టుకునేలా ఉంది. పతాక సన్నివేశాలలో పాత్రల్ని ఊహాకందనంత వేగంతో పరుగెత్తించారు.సస్పెన్సు, ఊహించని మలుపులు, కన్నులకు కట్టినట్లుగా సన్నివేశ రూపకల్పన వీరి ప్రత్యేకత. ఈ నవలలోని కథానాయిక దుర్గాంబ ఉరఫ్ రాణి దుర్గాంబికాదేవి. గతంలో 'క్వీన్ ఆఫ్ ఏలేశ్వరం'గా పేరుగాంచింది. తన ఇంట్లోనే భర్త నమ్మకాన్ని సంపాదించుకున్న దేవరాజు అన్న దాయాది, దుర్గాంబ కుటుంబాన్ని మోసంచేసి జమీనంతా స్వాధీనంచేసుకుంటాడు. దుర్గాంబ తన మనవరాలు హారిణితో బయట ప్రచ్ఛన్నంగా పనిమనుషులుండే పరిసరాల్లో బతకాల్సి వస్తుంది. దుర్గాంబ తన చాతుర్యంతో పోగొట్టుకున్న ఆస్తిని తిరిగిపొందటం కథాంశం. మామ్మగారి తెగువ, ధైర్యం, సమయోచితత్వం రాజవంశపు అందం పుణికిపుచ్చుకున్న మనవరాలి సహకారం, దేవరాజు ముగ్గురు కొడుకులు, కూతురు, అల్లుడు.. వీరందరి మధ్య సున్నితమైన హాస్యం చోటుచేసుకుంది. రాజమండ్రి నేపథ్యంలో నడిపిన ఈ కథలో అక్కడి ప్రకృతిని, పరిసరాలను చక్కగా వర్ణించారు. పఠితల్ని హాయిగా నవ్వించే నవల ఇది.

**(మహారాజశ్రీ మామ్మగారు:మన్నెం శారద; వెల: రూ.120; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు)**

-కూర చిదంబరం

## కథలనిండా మానవత్వ పరిమళం



మన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని, మనుషుల్లోని అంతర్గత సంఘర్షణలను, ప్రవర్తనాతీరులను, తరాల అంతరాలను, అవగాహన వైనాలను..తన కథల్లో చక్కగా ప్రతిబింబించటమే కాదు, తమ కథలను మానవత్వ పరిమళంతో నింపారు 'సాదృశ్యం' కథా సంపుటి రచయిత బి.వి.శివప్రసాద్. తొలి కథ 'స్వప్నం' ఉత్తమ పురుషలో సాగి, వృత్తి..ప్రవృత్తి..రచయితలో ఘర్షణ..వీటన్నిటికి అద్దం పట్టింది. ధీరజ్ స్వప్న సాకారంతో రచయితే కాదు, పాఠకుడూ ఆనందిస్తాడు. పిల్లల్ని ఇతరులతో పోలుస్తూ కించపరిచే ధోరణిని ఖండిస్తూ రాసిన కథ 'సాదృశ్యం'. ఇష్టాయిష్టాలు, ప్రత్యేకతలను పెద్దలు గుర్తించి, ప్రోత్సహించాలన్నదే సారాంశం. 'ఉత్సవం' కథ ప్రతిభాపోటీలకు దూరంగా ఉండిపోయే పేద విద్యార్థుల కథ. జ్యోతిలాంటివారు ఈ సమాజంలో ఎందరో. సరళ టీచర్‌లో మార్పురావటం, జ్యోతిని గుర్తించటం ఎంతో బాగుంది. 'యాత్ర' కథ జీవితయాత్రను సఫలం చేసుకోవటమెలాగో చెప్పే కథ. మానవ సేవే మాధవ సేవ అని చెప్పే కథ 'దైవం మానుష రూపేణా'. 'మునుస్వామి కథలో మునుస్వామి పాత్రను ఎంతో స్ఫూర్తివంతంగా తీర్చిదిద్దారు. 'కొత్తకోణం' కథ జీవితం యాంత్రికంగా మారిందని వగచే వారందరూ చదవవలసిన కథ. మిగిలిన కథలన్నీ కూడా చదివి తీరాల్సినవే.

**(సాదృశ్యం- కథా సంపుటి: బి.వి.శివప్రసాద్; వెల:రూ.100; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక షాపులు)**

-జె.శ్యామల

## మూస కవిత్వానికి భిన్నంగా..



సాధారణంగా ఒక దృశ్యమో.. సంఘటనో.. సందర్భమో సృజనకారుడి కలంనుండి కవిత్వమై మెరుస్తుంది. ఇవేమీలేకుండా ఓ అలౌకికానుభూతికి లోనయి ఊహలకు రెక్కలు తొడిగి పారవశ్యంతో పలవరించిన భావకవిత్వం కూడా కవితా ప్రియుల అనుభవానికి వచ్చేదే. ఈ ఒరవడి కవిత్వంలో కవి ఊహలోని 'వస్తువు' ఇదీ అని కచ్చితంగా చెప్పడం కొంత కష్టం. 'ఓ చిన్నోడా' అని కవయిత్రి పూర్ణిమా సిరి సంభోదిస్తున్న వ్యక్తిని బాహ్యంగా దర్శిస్తోందా..అంతరంగంలో నిలుపుకుందా..లేదా ఊహ జనితమైన అతీత పురుషుడితో సంభాషిస్తోందా?

"తెలిసినా తెలీనట్టు చేసే
తింగరోడివి నీవు
మాటతో మనసును తేలిక పరచగల
మాయలోడివి నీవు..

అంటూ మనకు పరిచయం చేస్తున్న చిన్నోడిని 'నిజంగా మనకు కావలసినది మనమేనా?' అని తార్కికంగా ప్రశ్నిస్తూ 'చెదరని మనసుల చెలిమి'గా అభివర్ణిస్తూ పాఠకుడ్ని 115 పుటల్లో నడిపించి 'చిన్నోడా! రూపాంతర జీవికకు రూపమునువ్వు' అని ముక్తాయిస్తారు కవయిత్రి. రొటీన్‌కు భిన్నంగా ఉన్నా..ఏకబిగిని చదివించగల రచనా శైలి కవయిత్రి సొంతం.

**(చిన్నోడా: పూర్ణిమా సిరి; వెల: రు.60; ప్రతులకు: అన్ని పుస్తకాల దుకాణాలు)**

- రమణ వెలమకన్ని

## శక్తిమంతమైన వ్యక్తీకరణ..



'భావ భాస్వరం' గేయ సంపుటి చదివినపుడు కవి చెఱకు సత్యనారాయణరెడ్డిపై వానమామలై వరదాచార్యుల ప్రభావం బాగా ఉందనిపిస్తుంది. ఇందులో దాదాపు 70కిపైగా అక్షర భాస్వరాలున్నాయి. వాటిలో ఒక వేగుచుక్క, తెలంగాణతల్లి, నా స్వప్నం, మనసున్న మనిషి, రైతే రాజా, నివేదన, ఎవరైతేనేమి, వైద్యోహరిః, పాదయాత్ర, భాగ్యోదయం తెండి, మరోగాంధి, దయాసింధువు, ఆకాంక్ష..వంటి గేయాలు కవిలోని శక్తిని, భావ సంఘర్షణను తెలిపే భాస్వరాలే.

ఆఫ్ఘానిస్థాన్ అంతటా/ ఆదిత్య హృదయం పఠిస్తే/
థార్ ఎడారి నుండి ధాన్యం/ టన్నుల్లో ఎగుమతి యైతే.. అంటారు కవి.

ఇది నా తల్లి తెలంగాణ తీగ తెగిపడిన ఒక వీణ
సవరిద్దామిక మనమైన సరిగమలొలికే విధమ్మున..
హిమాలయం వంగి నాకు/ ఓం నమామి యని అన్నయట్లు
తరతరాల మన చరిత్ర/ తవ్వి తలకు ఎత్తినట్లు..ఎంత ఎంత ఎంత హాయిగున్నది.. అలాగే 'అనాథలం' కవిత పాఠకుల్ని కంటతడి పెట్టిస్తుంది. అందులో..వీధి అరుగులే మంచము/ ఎంగిలాకు మా కంచము..కుక్కలతోనే నేస్తము/ చింపి గుడ్డ మా వస్త్రము..అనాథలం మేము..అంటారు.

**(భావ భాస్వరం-గేయ సంపుటి: చెఱకు సత్యనారాయణ రెడ్డి; వెల: రూ.100; ప్రతులకు: అన్ని ప్రధాన పుస్తక విక్రయకేంద్రాలు)**

-తంగిరాల చక్రవర్తి




# అచంచల ప్రేమ

కస్తూరి మురళీకృష్ణ

ఇంతకాలంనుంచీ అతడికోసం ఎదురుచూస్తోంది. ఇంకాస్సేపటికి అతడు వస్తాడని తెలుసు. ఆ వచ్చేది అతడేనని తెలుసు. అయినా ఈ చివరి ఘడియలు ఎంతో కఠినంగా ఉన్నాయి.

ఒకవైపు ఆనందం, మరోవైపు ఆందోళన, ఒకవైపు ఉద్విగ్నత, మరోవైపు ఆవేదన ఇలా పలురకాల విభిన్నమైన భావాల తాకిడితో ఉక్కిరిబిక్కిరి అవుతోంది దమయంతి. అయితే ఎంత తెచ్చుకుందామన్నా అతడిపై కోపం రావటం లేదు. అతడిపై నమ్మికతో గాఢంగా, సుఖంగా నిద్రిస్తున్న సమయంలో ఒక్కదాన్ని, కొత్త ప్రదేశంలో, దేశంకాని దేశంలో వదిలేసి వెళ్లాడు. ఎంత నిర్దయుడు.

ఆ తరువాత తాను ఎన్ని కష్టాలు పడింది!

అతడిని నమ్మి, ఏరికోరి అగ్నిసాక్షిగా వివాహం చేసుకుంది. జీవితాంతం తోడునీడగా ఉంటానంటే పరవశించిపోయింది. నమ్మింది, జూదంలో సర్వం కోల్పోతే స్వచ్ఛందంగా కట్టుబట్టలతో అతడి వెంట అనిశ్చిత గమ్యంవైపు నడచింది. అతడికోసం దేవతలను తిరస్కరించింది. అతడే తనలోకంగా జీవించింది. కానీ..అతడు తనని నిర్దాక్షిణ్యంగా వదలివెళ్లాడు. ఒంటరిగా తాను ఏమవుతుందోనన్న కనీసపుటాలోచన లేకుండా వదలివెళ్లాడు. అతడు తనను వదలి వెళ్లాడు. కానీ అతడే తన జీవితం. తన ఆలోచనలు సర్వం అతడి గురించే. ప్రతిక్షణం అతడి తలపులే. తనకళ్లు అతడినే వెతుకుతూ ఉన్నాయి. తన మెదడు అతడి గురించే ఆలోచిస్తోంది.

ఇన్నాళ్లకు అతడు వస్తున్నాడు. అతడిని చూస్తుంది. ఏమంటుంది? ఇన్ని రోజుల తన బాధలు చెప్పుకుని ఏడుస్తుందా? తనని ఇంత బాధపెట్టినందుకు అతడిని దూషిస్తుందా? తన మనసుకయిన గాయాలు చూపిస్తుందా? దమయంతి మనస్సు అల్లకల్లోలంగా ఉంది. ఎన్నో ఏళ్లనుంచి ఎదురుచూస్తున్న ఘడియ దగ్గరకు వచ్చిన సమయంలో ఏమిటీ ఆందోళన? అనుకుంది దమయంతి.

ఇంతలో ఓ పరిచారిక పరుగున వచ్చింది. 'బాహుకుడు వచ్చాడు' చెప్పింది.

పరుగున వెళ్లబోయి తనని తాను నియంత్రించుకుంది దమయంతి.

తనకు తెలుసు అందరూ బాహుకుడుగా భావిస్తున్న వాడు నలుడు, తన భర్త, తన ప్రియుడు, తన ప్రాణం అని తనకు తెలుసు. కానీ అందరికీ తెలియదు. అతడిని కలవటానికి తాను ఇలా పరుగిడటం భావ్యంకాదు. పరుగులిడుతున్న మనసును శరీర పరిధిలో ఒదిగింపజేసి, నియంత్రణలో ఉంచి, తన తడబాటును, వణకును కనబడనీయకుండా నెమ్మదిగా అడుగులు వేసింది దమయంతి.

కానీ ప్రతి అడుగు ఆమెకు గతాన్ని గుర్తుచేస్తోంది.

************

దమయంతి, నలుడిని ప్రేమించటం, నలుడు దమయంతిని ప్రేమించటం గాలివీయటం, నీరుపారటం, కోకిల పాడటం, మేఘం వర్షించటం అంత ప్రాకృతికంగా జరిగిపోయింది.

వారి ప్రేమకు ప్రతిబంధకాలు కలిగించాలని ఎందరో ప్రయత్నించారు.

తాము నలుడికన్నా శౌర్యవంతులమనీ, శక్తిమంతులమనీ, దమయంతి నలుడిని ఇష్టపడటాన్ని వ్యతిరేకించారు.

దమయంతి, నలుడు ఎవరి అభ్యంతరాలను ఖాతరు చేయలేదు. ప్రతిబంధకాలను లెక్కచేయలేదు.

'ఇతరులకన్నా నలుడు ఏంగొప్ప? నలుడిలో ఏముంది?' అని ఎన్నోమార్లు తనను తాను ప్రశ్నించుకుంది.

ఆమెకు సమాధానం లభించలేదు. కానీ నలుడి పేరు తలచినా మనసులో ఆనంద తరంగాలు ఎగసెగసి పడటం ఆమెకు అనుభవం.

వివాహమయిన తరువాత నలుడిని ఇదేప్రశ్న అడిగింది.

'ఎందుకని ఎంతోమంది సుందరమైన యువతులుండగా మీకు నేను నచ్చాను?'

దానికి నలుడు సమాధానంగా నవ్వాడు.

'ఈ ప్రపంచంలో ప్రతి కార్యానికి కారణం ఉంటుంది. కొన్ని మన బుద్ధికి అందుతాయి. కొన్ని అందవు. బుద్ధికి అందని వాటిని దైవేచ్ఛగా భావించాల్సి ఉంటుంది. ఈ ప్రపంచంలో మనకి కనిపించే శక్తులు కొన్ని కనిపించని శక్తులు కొన్ని. మనకు కనిపించే శక్తుల పని మనకు తెలుస్తుంది. కనబడని శక్తుల పని మనం ఊహించాల్సి ఉంటుంది. అలాంటి కనబడని శక్తులు మనలో ఒకరిపై ఒకరికి అనురాగం జనించేట్టు చేశాయి. మనల్ని కలిపాయి. మనల్ని సర్వదా రక్షిస్తూ ఉంటాయి. కొన్నిటికి కారణాలు తర్కించకుండా స్వీకరించి ఆనందించటమే పని. మన ప్రేమ అలాంటిది' అన్నాడు నలుడు.

'మనల్ని కలిపిన శక్తులే మనల్ని విడదీయవచ్చుగా?' ప్రశ్నించింది దమయంతి.

ఆమెవైపు ప్రేమగా చూశాడు నలుడు. 'మన ఆలోచనలు తరంగాలలాంటివి. ఎలాగయితే ప్రతి తరంగం సముద్ర ఉపరితలంపై సంచలనం కలిగిస్తుందో, అలా మన ప్రతి ఆలోచన మన చుట్టూ ఉన్న ఆకాశంలో స్పందనలు కలిగింపచేస్తుంది. ఆ స్పందన మళ్లీ మనపై ప్రభావం చూపించే వీలుంది. అందుకని శుభం పలకాలి. శుభం వినాలి. శుభకరమైన ఆలోచనలు మాత్రమే చేయాలి అంటుంది వేదం. అందుకే మన కావ్యాలు, సాహిత్యం అంతా సుఖాంతం అవుతాయి. సర్వేజనా సుఖినోభవంతు అంటాయి. ఎప్పుడూ ఎలాంటి అశుభమైన ఆలోచనలు దరిరానీయకు' అన్నాడు.

భవిష్యత్తును దర్శించి అన్నట్టే అన్నాడు నలుడు ఆమాటలు అనుకుంది దమయంతి, భవిష్యత్తులో జరిగిన సంఘటనలను వెనుతిరిగి చూసుకుంటూ.

ఆ తరువాత హఠాత్తుగా దుర్దశ ఆరంభమైంది.

పుష్కరుడు నలుడిని జూదం ఆటకు ఆహ్వానించాడు.

సాధారణంగా ఎలాంటి వ్యసనాలకు లొంగని నలుడు ఆ ఆహ్వానాన్ని మన్నించాడు.

పుష్కరుడిపై తన గొప్పతనాన్ని చూపించుకోవాలని తపనపడ్డాడు.

ఎవరు దేనికోసం తాపత్రయపడతారో అదే వారి పతనానికి దారితీస్తుందంటారు.

నలుడు జూదంలో ఓడిపోసాగాడు. ఓడుతున్న కొద్దీ అతని పట్టుదల పెరుగుతోంది. పట్టుదల పెరిగిన కొద్దీ పందెం పెరుగుతోంది. పందెం పెరిగిన కొద్దీ నలుడిపై దురదృష్టం ఆధిక్యం సాధిస్తోంది.

నలుడు ఓడిపోవటం చూసిన దమయంతి తమ కొడుకు, కూతుర్ని

పుట్టింటికి పంపేసింది. నలుడి సరసన కట్టుబట్టలతో నిలబడింది.

తమ ఇద్దరికీ ఒకరికొకరు తప్ప ప్రపంచంలో మరేమీ లేదన్న గ్రహింపు వచ్చిన సమయం అది. తమ నగరం వదలి ప్రయాణం ఆరంభించారు.

'జీవితంలో సంభవించే ప్రతి సంఘటన, అనుభవించే ప్రతి అనుభవం మనకు ఏదో పాఠం నేర్పటానికే. మనం వాటి ప్రాధాన్యం గుర్తించే ప్రయత్నంచేయాలి.

'దేన్నయినా భగవధ్యానంతో ఎదుర్కోవాలి' అన్నాడు నలుడు.

దమయంతి మౌనంగా అతడిని అనుసరించింది.

చివరికి ఎలాంటి దుస్థితి దాపురించిందంటే వారికి తినటానికి తిండి దొరకలేదు. నీటితో కడుపు నింపుకుంటూ గమ్యం తెలియని ప్రయాణం సాగించారు. చివరికి కొన్నాళ్లకి నీళ్లు కూడా లభించని పరిస్థితులు సంభవించాయి.

ఆ సమయంలో అవంతి నగరం వైపు పోతున్న వ్యాపారులు కొందరు కనిపించారు. వారితో దమయంతిని వెళ్లమన్నాడు నలుడు.

దమయంతి తిరస్కరించింది.

'నేను ప్రస్తుతం ఎలాంటి దురదృష్టకరము, దౌర్భాగ్యమూ అయిన దశలో ఉన్నానంటే నా వెంట ఉన్న వారూ కష్టాలు అనుభవిస్తారు. నువ్వు కష్టాలు అనుభవించటం నాకు ఇష్టంలేదు. నేను భరించలేను. అవంతికి వీళ్లతో వెళ్లి నీ ప్రాణాలయినా కాపాడుకో' బతిమిలాడాడు.

'నా ప్రాణం మీరు. ప్రాణం వదలి ప్రాణాల్ని కాపాడుకోవటం అన్నది అర్థంలేదు. నా జీవనం, మరణం మీతోనే' అంది స్థిరంగా.

ఆరోజు రాత్రి కొసప్రాణాలతో ఓ చిన్నపల్లె చేరుకున్నారు. కానీ ఎవరూ ఆతిథ్యం ఇవ్వలేదు. అతికష్టంమీద నిద్రించే స్థలం సంపాదించారు. బాగా అలసిపోయి ఉండటం వల్ల వెంటనే నిద్రపట్టింది.

నిద్రలో అందమైన కల వచ్చింది దమయంతికి. తామిద్దరూ మళ్లీ తమ పూర్వ వైభవాన్ని సాధించి సుఖంగా, సంతోషంగా ఉన్నారు అన్నట్టు కల వచ్చింది.

ఎంతో సంతోషంగా, ఆనందంగా కళ్లు తెరచి పక్కకు చూసిన దమయంతి కళ్లు బైర్లుకమ్మాయి. లోకం చీకటయిపోయింది.

ఒక్కసారిగా ఏది కల? ఏది నిజం? అన్న గ్రహింపు పోయింది.

పక్కన నలుడు లేడు. పక్కనే కాదు, ఎక్కడా లేడు. అర్ధరాత్రి, ఊరుగాని ఊళ్లో, ఒక్క పరిచితుడూ లేని ప్రాంతంలో ఒక్కర్తినీ అలా వదలి ఎలా వెళ్లగలిగాడో నలుడు, ఇప్పటికీ అర్థంకాలేదు దమయంతికి. గుండెలు పగిలేలా రోదించింది.

ఆకాశం మునిగిపోయేలా కన్నీరు కార్చింది.

హృదయం బద్దలయ్యేలా శోకించింది.

కానీ ఎవ్వరూ ఆమెపై సానుభూతి చూపలేదు. జాలి చూపలేదు. పైగా ఆమెనే దూషించారు. ఆమెనే తప్పుపట్టారు.

ఒంటరి మహిళ కావటంతో అందరికీ చులకన అయింది.

పెద్దలు కామం నిండిన కళ్లతో చూసేవారు. అల్లరి పిల్లలు పిచ్చిదని రాళ్లతో కొట్టేరు. కానీ ఇవేవీ దమయంతిని తాకలేదు.

తనను ప్రాణం కన్నా మిన్నగా ప్రేమించిన నలుడు ఇలా కాకులకు, గద్దలకు, పులులకు, తోడేళ్లకు తనని వదలి వెళ్లిపోవటం ఏమిటి? ఇదేనా జీవితాంతం ఉండే ప్రేమ? ఇదేనా అగ్నిసాక్షిగా నిలచిన ప్రేమ ఫలితం? ప్రేమంటే ఏమిటి? ఇరు హృదయాల కలయికనా? ఇరు తనువుల కలయికనా?

తనువుల కలయికలోని ఆత్రం, సౌఖ్యం కాలాన్ని బట్టి మారుతూంటుంది. హృదయాల కలయికలోని సౌందర్యం కాలం గడుస్తున్న కొద్దీ ఇనుమడిస్తుంది. మరి ఏది తమ హృదయానుబంధం ఈనాడు? ఆ హృదయానుబంధాన్ని వదలి ఎలా వెళ్లగలిగాడు నలుడు? అంతగా తనని వదలి వెళ్లాల్సి ఉంటే తనకు చెప్పి అనుమతి తీసుకోవాల్సింది. ఇలా చెప్పాపెట్టకుండా అదృశ్యం అయిపోవటం ఏమిటి?

దమయంతి మనస్సులో సుళ్లు తిరుగుతున్న ఆవేదన ఆమెను నిలవనీయటంలేదు. తన చుట్టూ ప్రవాహంలా పరుగులిడుతున్న ప్రపంచంలో తనకు సంబంధంలేదన్నట్టు జీవించసాగిందామె.

ఆమెను చూసి, ఆమెలోని దివ్యత్వాన్ని గుర్తించిన ఛేది దేశపు రాణి, తన నిలయానికి ఆమెను ఆహ్వానించింది.

'నేను నీ రాణివాసంలో ఉంటాను కానీ సేవకురాలిగా ఉండను. నా భర్త తప్ప పరపురుషుని ముందుకు రాను. సంభాషించను'.

నలుడి భార్య తాను. ఏనాడో ఓనాడు మళ్లీ తామిద్దరు కలుస్తారు అన్న విశ్వాసంతో ఉంది దమయంతి. అందుకే ఎందరో మళ్లీ వివాహం చేసుకోమని ఎంత ఒత్తిడి తెచ్చినా ఆమె లొంగలేదు.

'నీ మానాన నిన్ను వదలి వెళ్లిపోయాడు. వాడికోసం నువ్వు ఎదురుచూడటం ఎందుకు? వాడు ఎక్కడో మళ్లీ పెళ్లిచేసుకుని హాయిగా ఉండి ఉంటాడు. నువ్వెందుకు ఇలా జీవితాన్ని వ్యర్థం చేసుకోవటం?' అని ఆమెను ఒప్పించాలని ప్రయత్నించారు అనేకులు.

వారందరికీ ఆమెది ఒకటే సమాధానం. 'మనిషి శరీరంపైని ప్రేమనే అసలు ప్రేమ అనుకునే వారి ప్రేమ శరీరం సన్నిహితంగా ఉండటంపై ఆధారపడి ఉంటుంది. ప్రేమ భౌతిక ప్రపంచానికి చెందినది కాదు. దాని స్వరూప స్వభావాలు తెలిసిన వారికి ప్రేమ మనిషి ఎదురుగా ఉండటంపై ఆధారపడి ఉండదు'.

ఇంతలో దమయంతి ఎక్కడ ఉందో తెలిసిన ఆమె తండ్రి ఆమెను తన దగ్గరకు తీసుకువెళ్లాడు.

'నలుడు లేనిదే నేను ప్రశాంతంగా సుఖంగా జీవించలేను. నలుడి జాడ తెలుసుకోవాలి' అంది తండ్రితో.

ఫలితంగా ఆమె తండ్రి నలుడికోసం వెతికించాడు.

అలా వెళ్లిన వాళ్లల్లో ఒకడు బాహుకుడి గురించి దమయంతికి చెప్పాడు. 'బాహుకుడికి నలుడికీ పోలికలేదు. కానీ, దమయంతి పేరు ప్రస్తావించినప్పుడల్లా అతడి కళ్లల్లో మెరుపు, మేనిలో గగుర్పాటు అనుమానం కలిగిస్తోంది' అన్నాడు.

అది విన్న దమయంతిలో ఆశలు చిగురించాయి.

బాహుకుడి రూప వర్ణన నలుడికి ఏమాత్రం సరిపోకున్నా, నీట మునిగేవాడు గడ్డిపోచనే ఆధారంగా భావించినట్టు ఆమె ఆ వార్తనే నిజంగా నమ్మింది. బాహుకుడిని గమనించి మరిన్ని వివరాలు సేకరించమని స్నేహితురాలిని పంపింది.

ఆమె సేకరించి అందించిన సమాచారం దమయంతిలో బాహుకుడే నలుడు అన్న నమ్మకాన్ని పెంచింది.

'బాహుకుడు సేవకుడే కానీ యజమానిలా ప్రవర్తిస్తాడు. అతడి వినయంలోనూ ఆత్మగౌరవం ఉట్టిపడుతూంటుంది. ఎల్లప్పుడూ అతడు 'ఆమె ఎక్కడ ఉందో? ఎలా ఉందో? క్రూరుడనై పరిత్యజించిన ఆ పడతి ఎలా ఉందో?' అని తనలోతాను గొణుక్కుంటూ ఉంటాడు. ఎప్పుడూ మౌనంగా, గంభీరంగా ఉండే అతడు దమయంతి ప్రస్తావన వస్తే మటుకు ఒళ్లంతా కళ్లు, చెవులు అయిపోతాడు. యవ్వనంలో ప్రేయసి ప్రసక్తి కోసం తహతహలాడే యువకుడయిపోతాడు'.

బాహుకుడిని పిలిపించమని ఆమె తండ్రిని అభ్యర్థించింది.

ఆమె మాటను తండ్రి మన్నించాడు.

బాహుకుడే నలుడని దమయంతి విశ్వాసం. అందుకనే ఆత్రంగా బాహుకుడి రాకకోసం ఎదురుచూడసాగింది దమయంతి.

***********

అలికిడి విని బాహుకుడు ఆమెవైపు తిరిగాడు. నల్లగా అసహ్యంగా ఉన్నాడు బాహుకుడు. అతి సుందరుడయిన నలుడిపోలిక ఏమాత్రం లేదు. కానీ దమయంతిని చూడగానే వర్షకాభ్రముల ఫెళఫెళకు ముందు ఆకాశాన్ని వెలుగుమయం చేసే విద్యుల్లత అతని కళ్లల్లో తటాలున మెరిసింది. ఆపై వర్షపు జల్లు కురిసినట్టు అతని కళ్లు నీటిమయమయ్యాయి.

అతని కన్నీరు దమయంతి కంటిలో ప్రతిఫలించింది. అతని హృదయంలోని వేదన ధ్వని దమయంతి హృదయం ప్రతిధ్వనించింది. ఆమె తననితాను నియంత్రించుకుంది.

'బాహుకుడా. అగ్నిసాక్షిగా జీవితాంతం కాపాడతానని, కలసి

( మిగతా 19వ పేజీలో )

# రాజుగారి నిర్ణయం

కథ

కందర్ప దేశ రాజు విలోమ వర్మ ఒక్కొక్కసారి మొండిగా వ్యవహరించేవాడు. మంత్రులుగాని, శ్రేయోభిలాషులుగాని ఆయన తీసుకున్న నిర్ణయాలు కొన్నింటిని పునరాలోచించ వలసిందిగా కోరినా ఆయన ఒప్పుకొనేవాడు కాదు. ఆవిధంగా ఆయన తీసుకున్న నిర్ణయాల వలన ఎందరో ఇబ్బందులపాలవవలసి వచ్చేది.

ఇలా ఉండగా రాజ్యానికి తూర్పుదిక్కున ఒక పెద్ద కోట నిర్మిస్తే మంచిదని రాజు విలోమవర్మ ఆలోచించి, తనకొచ్చిన ఆలోచన మంత్రి సులోచనుడికి చెప్పాడు.

"రాజా! అక్కడ కొంతభాగం అడవి ఉంది. ఆ అడవిని నాశనం చేయకుండా, పడమర దిక్కున ఉన్న మైదానంలో కోట కడితే అడవి నాశనం అవదు, అదీగాక తూర్పు దిక్కున ఉన్న అడవిలో ఎన్నో జబ్బులకు ఉపయోగపడే ఔషధ మొక్కలు ఉన్నట్టు మన ఆస్థానవైద్యులు చెప్పారు. అందుకని వారిని కూడా ఈ విషయంలో సంప్రదిస్తే మంచిది" అన్నాడు.

ఎవరెన్ని చెప్పినా కోటను అక్కడ కడితేనే మంచిదని, కోట అంతఃపురానికి దగ్గరగా ఉంటుందని, వైద్యానికి పనికివచ్చే మొక్కలు ఎక్కడైనా పెరుగుతాయని, అదీగాక అక్కడే ఉన్న చిన్న కొండను తొలచి, ఆ రాళ్లతోనే కోట కట్టవచ్చని రాజు మొండిపట్టుపట్టాడు.

ఇక మంత్రి సులోచనుడు చేసేదిలేక ఊరుకున్నాడు. ఆస్థాన వైద్యుడికి ఆ సంగతి తెలిసి రాజుతో వైద్యానికి ఉపయోగపడే మొక్కల సంగతి చెప్పినా రాజు తన అభిప్రాయం మార్చుకోలేదు.

దాంతో అక్కడి అడవిని నరికి ఓ పెద్దకోటను రెండేళ్ల వ్యవధిలో కట్టారు. కోటను చూసి రాజు మురిసిపోయాడు.

అంతలో రాజుగారి కాలివేలుమీద ఒక విచిత్రమైన పుండు వచ్చింది. రాజవైద్యులు దాన్ని పరీక్షించి, దానికి కావలసిన మందు రాజ్యానికి తూర్పున ఉన్న అడవిలో మాత్రమే లభించేవని, అక్కడ ఉన్న నేలసారం ఆ మొక్కకు చికిత్సకు పనికివచ్చే సారాన్ని, పసరుని ఇస్తుందని చెప్పారు. కానీ ఇప్పుడు ఆ అడవి స్థానంలో కోట వుంది. అక్కడ అలాంటి మొక్కలు ఉన్నాయేమో వెతకమని రాజు ఆదేశించాడు.

కానీ ఎంత పరిశీలించినా కోట నిర్మాణం వల్ల ఆ మొక్కలు పూర్తిగా లేకుండాపోయినట్లు తేలింది. చేసేదిలేక రాజవైద్యులు ఎంతో శ్రమించి, వందల మైళ్లు వెళ్లి వెతికి ఆ మొక్క సేకరించారు. కానీ అందుకు ఆరునెలల కాలం పట్టింది. అంతలో రాజుగారి పుండు పెద్దదైపోయింది. ఇంకా ఆలస్యంచేస్తే మంచిదికాదని శస్త్రచికిత్స ద్వారా తొలగించారు.

అప్పుడు రాజుగారికి జ్ఞానోదయం అయింది. ఎవరెంత చెప్పినా వినక అడవిని నిర్మూలించి కోటను కట్టడం వల్ల ఔషధమొక్కలు నశించిపోయాయని గ్రహించాడు రాజు. ప్రకృతి వనరుల విషయంలో మంత్రులు, తదితరుల సలహాల మేరకే ఇకపై నిర్ణయాలు తీసుకుంటానని సభలో చెప్పాడు.

రాజులో వచ్చిన మార్పుకు అంతా సంతోషించారు.

–కంచనపల్లి వేంకట కృష్ణారావు, కర్నూలు.

## రం గు లు వే యం డి



పిల్లలూ! కింద ఇచ్చిన సూచన ప్రకారం పై బొమ్మకు ఆయా అంకెల వద్ద ఆయా రంగులు వేయండి.
1. రెడ్ 2. ఎల్లో 3. బ్లూ 4. గ్రీన్ 5. బ్రౌన్
6. బ్లాక్ 7. ఆరెంజ్ 8. పర్పుల్

## దారి చూపుతారా










# వార్త ఆదివారం

## మా వూరి చెరువు

బాల గీతం



మా వూరి చెరువు
మా మంచి చెరువు

తియ్యని నీళ్లిచ్చే చెరువు
చల్లనిగాలిచ్చే చెరువు
కలువలు పూచిన చెరువు
కమలాలు విచ్చిన చెరువు

పిల్లలు ఈదులాడే చెరువు
పువ్వులు తేలియాడే చెరువు
చేపలు తిరుగాడే చెరువు
కప్పలు కదలాడే చెరువు

ఎత్తైన గట్టున్న చెరువు
కట్టపై చెట్లున్న చెరువు
చెట్లపై గూళ్లున్న చెరువు
గూళ్లలో పక్షులున్న చెరువు

వానను దాచుకునే చెరువు
జాబిల్లికి అద్దమైన చెరువు
పంటలను పండించే చెరువు
జీవుల దాహం తీర్చే చెరువు

-కందేపి రాణీప్రసాద్

## హలో ఫ్రెండ్...



చిన్నారుల ప్రశ్నలకు

వార్త సిఎండి, మేనేజింగ్ ఎడిటర్

**గిరీష్ అంకుల్ సమాధానాలు**

పి.ఆనంద్, మెదక్.

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఏడో తరగతి చదువుతున్నాను. సహజ వాయువు అంటే ఏమిటి? అందులో మిళితమై ఉండేవి ఏవి? సహజవాయువు ఎలా లభిస్తుంది? దయచేసి వివరించండి.**

**జవాబు:** ఆనంద్! మిథేన్, ఈథేన్, ప్రొపేన్ వంటి అనేక వాయువులు కలిసిన మిశ్రమమే సహజవాయువు. దీనికి రంగు, రూపు, వాసన ఉండదు. కానీ దీన్ని మండించినప్పుడు మాత్రం విపరీతమైన శక్తి విడుదల అవుతుంది. సహజవాయువు వల్ల ప్రధాన ప్రయోజనమేమిటంటే..దీన్ని మండించినప్పుడు వాతావరణంలోకి విడుదలయ్యే హానికరమైన వాయువుల మోతాదు చాలా తక్కువ. అందువల్ల శిలాజ ఇంధనాల కన్నా సహజవాయువు వల్ల పర్యావరణపరంగా ప్రయోజనం అధికం. చమురునిల్వలు ఉన్న ప్రాంతంలో సాధారణంగా సహజవాయువు కూడా ఉంటుంది. అందువల్ల ఆ ప్రాంతాల్లోనే సహజవాయువు కోసం డ్రిల్లింగ్ జరుపుతారు. దాంతో పాటు బయటకు వచ్చే హైడ్రోజన్ సల్ఫైడ్ వంటి వాయువులను శుద్ధిచేసి, వేరే విధంగా ఉపయోగించుకుంటారు. ఎటువంటి మలినాలు లేని సహజవాయువును పైపుల ద్వారా అవసరమైన ప్రాంతాలకు రవాణాచేస్తారు. శిలాజ ఇంధనాలు ఎలా ఏర్పడుతాయో, సహజవాయువు కూడా అలాగే ఏర్పడుతుంది. కోట్ల ఏళ్లక్రితం చని పోయిన జంతువుల మృతదేహాలు చెట్ల బురదలో కప్పబడిపోతాయి. కాలంతో పాటుగా వీటిమీద మరిన్ని పొరలు ఏర్పడుతాయి. విపరీతమైన ఒత్తిడి, అత్యధిక ఒత్తిడి..అత్యధిక ఉష్ణోగ్రత వల్ల అవన్నీ కార్బన్ బాండ్స్‌గా విడిపోతాయి. అప్పుడు సహజవాయువు ఏర్పడుతుంది. అందువల్లే సహజవాయువును వెలికితీయటానికి చమురుకన్నా లోతుగా తవ్వాల్సి ఉంటుంది. సాధారణంగా సహజవాయువు తీవ్రమైన ఒత్తిడితో పైకి వస్తుంది. అందువల్ల దాన్ని వెలికితీయకముందే అత్యంత పటిష్టమైన భద్రతాచర్యలు తీసుకుంటారు.

డి.కావ్య, తెనాలి.

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఏడో తరగతి చదువుతున్నాను. ఆపిల్‌ను కోసి ఉంచితే కొద్దిసేపటికి లోపలివైపు రంగుమారుతుందెందుకు? దయచేసి చెప్పండి.**

**జవాబు:** కావ్యా! ఆపిల్‌పండులో ఐరన్ (ఫ్రెరస్) ఎక్కువపాళ్లలో ఉంటుంది. పండు కోసిన తర్వాత ఆముక్కవైపు భాగం వాతావరణంలోని ఆక్సిజన్ వాయువుతో ఆక్సీకరణం చర్య జరుపుతుంది. అందువల్ల ఉపరితలంమీద ఫెర్రస్ ఆక్సైడ్, పొర తరహాలో ఏర్పడుతుంది. దీని వల్ల మనకు రంగు మారినట్లు కనపడుతుంది.



# స్టాంపులతో వెరైటీ 'చిత్రాలు'!

**'కాదేదీ కళకనర్హం' అనే లోకోక్తిని మరోమారు రుజువు చేసింది దీప మెల్కొటే. ఆమె ప్రస్తుత వయసు 82 సంవత్సరాలు. నలభై ఏళ్లుగా వాడేసిన భారతీయ పోస్టల్ స్టాంపులతో చిత్రాలను రూపొందిస్తోంది. దీపలో ఎన్నో ప్రత్యేక ప్రావీణ్యతలున్నా ఆమెకు ఈ తపాలా బిళ్లల చిత్రకళపైనే ఎక్కువ మక్కువ. ఆమె వివిధ అంశాలను వర్గీకరించి, ఆప్రకారం చిత్రాలను రూపొందిస్తుంది. చారిత్రక కట్టడాలు, నృత్యకళాకారులు, రకరకాల పక్షులు, పౌరాణిక పాత్రలు..ఇలా ఎన్నో.**


స్టాంపులతో 'చిత్రాలు' చేసే దీప

ప్రకాశవంతంగా ఉండే తపాలాబిళ్లలోను తీసుకొని, వాటిని తన ఆలోచనలకు తగ్గట్లుగా వేరుచేసుకొని, చిన్న ముక్కలుగా కత్తిరించుకుని తన స్కెచ్‌పై జాగ్రత్తగా అతికిస్తుంది.

ఈ స్టాంప్ ఆర్ట్ గురించి దీపను ప్రశ్నించినపుడు ఆమె ఇలా అంటారు...'నేనోసారి ఓ మ్యాగజైన్‌లో ఓ బ్రిటిష్ వనిత స్టాంపులను సేకరించితన ఇంటికి వాల్‌పేపర్‌గా తయారుచేయటం గురించి చదివాను. అప్పుడు నాకు కూడా అనవసరంగా పారేసే స్టాంపులతో ఏదైనా చేయవచ్చుకదా అనే ఆలోచన వచ్చింది. రంగురంగుల స్టాంపులు నన్నెంతో ఆకర్షించాయి.' అంటారు. అయితే కాలంతో పాటు మారిన పరిస్థితులు, ఆధునిక సాంకేతికత ఆమె హాబీని కొంత నిరుత్సాహ పరిచాయి.

ఇక ఎంతోకాలం తనకు పోస్ట్ రాదని, ఒకటి, అరా వచ్చినా ఆ స్టాంపులు తనను ఆకర్షించవని, ఒకప్పుడు అంటే 1970లో తను ఈ స్టాంప్ ఆర్ట్ ప్రారంభించినపుడు ఆ తపాలా బిళ్లలు చక్కటి రంగులలో ఎంతో అర్ధవంతంగా ఉండేవని ఆమె అంటుంది. అయితే దీప స్టాంప్ ఆర్ట్ గురించి చెప్పుకునేటపుడు కర్నాటక ఫిలాటలీ సొసైటీ గురించి కూడా ప్రస్తావించుకోవాలి. ఎక్కడుందీ ఆ సొసైటీ అంటే...

బెంగళూరులోని రాజ్‌భవన్‌రోడ్‌లో రాతితో కట్టిన ఓ భవనం, పైన డోమ్‌తో చూపరులనిట్టే ఆకర్షిస్తుంది. ఒకప్పుడు అది బెంగళూరు నగరంలో స్కైలైన్‌కు హాల్‌మార్క్‌గా ఉండేది. కానీ మెట్రోరైల్ రాకతో, హోర్డింగులతో, బిజినెస్ హోటళ్ల పెంట్ హౌస్‌లతో ఆ భవనం ప్రత్యేకత కోల్పోయింది.

మెడసాచి చూస్తే మనకు ఆబిల్డింగ్ ముందువైపు ఉన్న లోగో కనిపిస్తుంది. ఎరుపు చదరంలో మూడు పసుపు రెక్కలు కలిగిన లోగో అది. ఒకప్పుడది జనరల్ పోస్ట్ ఆఫీస్‌గా ఉండేది. ప్రతినెల మొదటి ఆదివారం ఫిలాటలిస్టులు ఇక్కడ కలుసుకుంటుంటారు. కర్నాటక ఫిలాటలీ సొసైటీని వారు 1975లో స్థాపించారు. ఫిలాటలీ (తపాలా బిళ్లల సేకరణ) హాబీని ప్రోత్సహించటం, సంబంధిత విజ్ఞానాన్ని పెంచటం వారు తమ ధ్యేయాలుగా పెట్టుకున్నారు.

ఈ సంస్థలో 500మంది జీవితకాల సభ్యులు ఉన్నారు. జనరల్ సెక్రటరీ నిఖిలేష్ మెల్కొటే. ఈయన తన ఎనిమిదేళ్ల వయసునుంచి తపాలాబిళ్లలను సేకరిస్తున్నాడు. నిఖిలేష్, దీప కుమారుడే.

నిఖిలేష్ అన్నిరకాల తపాలా బిళ్లలను సేకరించాడు. అయితే కొంతకాలానికి సేకరణలో కూడా శాస్త్రీయత ఉండాలను కున్నాడు. జాతీయ పతాక, క్రికెట్ థీమ్‌లతో ఎన్నో స్టాంపులు ఆయనవద్ద ఉఆన్నాయి. తన హాబీని తన తల్లిదండ్రులు ఎలా ప్రోత్సహించిందీ చెబుతాడు నిఖిలేష్.తన హాబీకి సంబంధించిన పుస్తకాలు, వస్తువులను సమకూర్చటంలో వారెంతో తోడ్పాటునందించేవారంటాడు. తను ఫిలాటలీలో అంతర్జాతీయ అవార్డులను గెలుచుకున్నా, విదేశీ స్టాంపుల ప్రదర్శనలకు వెళ్లినా..తానా స్థాయికి చేరుకోవటానికి కారణం తల్లిదండ్రులేనంటాడు.



హాబీల పట్ల పూర్తి అవగాహన గల మహిళ దీప. ఎందుకంటే ఆమెకే ఎన్నో హాబీలున్నాయి.

ఇందిరా నగర్‌లోని దీప నివాసం నుంచి నిత్యం ఉదయం వివిధ్ భారతి రేడియో వినిపిస్తుంది. దీప ఆ పాటలు వింటూనే తన పని ముఖ్యంగా నీడిల్ వర్క్ చేసుకుంటూ ఉంటుంది.

దీప బాల్యంలో ఎంబ్రాయిడరీని హాబీగా చేసుకుంది. 70 ఏళ్ల తర్వాత సైతం ఆమె ఎంతో అందమైన డిజైన్లను టేబుల్ క్లాత్‌లపై

వేస్తుంటుంది. స్నేహితులకు చీరలపై కష్టమైన కసుటి డిజైన్లను వేసిస్తుంది. నీడిల్ వర్క్‌ను కేవలం హాబీగానే కొనసాగించింది. ఆమె స్టేట్ లెవెల్ బ్రిడ్జిప్లేయర్ కూడా.

దీప భర్త ఐఎఎస్ ఆఫీసర్. ఉద్యోగరీత్యా కర్నాటకలోని వేర్వేరు ప్రాంతాలకు వెళ్లవలసివచ్చింది. అలా గుల్బర్గా నుంచి రాయ్ చూర్ వరకు వేర్వేరు ప్రదేశాలకు వారు వెళ్లారు. అయినా దీప, ఆమె కుమారుడు నిఖిలేష్ తమ హాబీలను వెళ్లిన ప్రతిచోట కొనసాగించారు.

'వస్తువుల్ని పారేయటం నాకు ఇష్టం ఉండదు' అంటుంది దీప నవ్వుతూ. ' మా అబ్బాయి తనకు పనికిరావని భావించిన స్టాంపు లన్నిటిని నేను సేకరించి నా ఆర్ట్‌కు వాడుతుంటాను. మా వారి ఆఫీసులో సైతం అందర్నీ స్టాంపులను పారవేయకుండా తనకు అందించమని




చెప్పేవారని ఆమె అటుంది. తన తల్లి స్టాంప్ ఆర్ట్ గురించి నిఖిలేష్ ఇలా చెబుతాడు... కొన్ని సార్లు కావలసిన రంగు స్టాంపులేక ఆమె పని ఆగిపోతుంది. అటువంటి సమయాల్లో నేను నా ఫిలాటలీ స్నేహితుల్ని అడిగి, వేర్వేరు ఉత్తరాలపై స్టాంపులను వెతికి అందించేవాడిని. నా స్కూలు రోజుల్లో మా అమ్మ స్టాంపులను జాగ్రత్తగా, ఎంతో ఓర్పుగా కట్‌చేసి అతికించడం చూస్తుండేవాడిని. ఓర్పు, కష్టపడి పనిచేయడం అనే సుగుణాలు నాకు, మా అమ్మనుంచే వచ్చాయి. నా హాబీకి అవి చాలా అవసరం.

దీప ఎంతో సృజనాత్మకతతో రూపొందించిన ఆర్ట్‌వర్క్‌లలో ముఖ్యమైనవి..మదురై మీనాక్షి ఆలయం, తుంగభద్ర డ్యామ్, హౌరా బ్రిడ్జి, బెంగళూరు విధాన సౌధ చెప్పుకోవచ్చు. ఆమె చాలా వేగంగా స్కెచ్ వేసేస్తుంది. ఆ తర్వాత పని ముందుకు సాగటమనేది ఆమె కోరుకున్న స్టాంపులు అందుబాటులో ఉండటాన్ని బట్టి ఉంటుంది. సరైన రంగులు దొరకటానికి వేచి ఉండాల్సి వస్తుంది. సరిపోయే స్టాంపులు ఉంటే పొద్దుటి నుంచి రాత్రివరకు కూర్చుని దాన్ని పూర్తిచేస్తుంది ఆమె.

నలభై ఏళ్లుగా ఆమె స్టాంప్ ఆర్ట్‌లో కృషి చేస్తున్నా ఆమె అంతగా వెలుగులోకి వచ్చింది లేదు. 'ఇప్పటివారికి సహనం తక్కువ, నాస్నేహితులు కొంతమంది తమకు కసుటి నేర్పించమని అడిగారు. కానీ రెండురోజులు గడవగానే తమకు అంత ఓపిక లేదని చెప్పేసారు' అంటుందామె.

దీప కొంతకాలం ధార్వాడ్‌లోని కర్నాటక యూనివర్సిటీలో సంస్కృత లెక్చరర్‌గా పనిచేసింది. విద్యార్థిగా ఉన్నప్పుడు చదువు లో ఎప్పుడూ ముందుండేది. మూడు డిగ్రీలలో ఫస్ట్‌క్లాస్ సాధించిం దామె. ఎల్‌ఎల్‌బి డిగ్రీ కూడా ఆమె పొందింది. నిఖిలేష్ ఫిలాటలీ విషయమై ఎక్కువ శ్రద్ధ తీసుకుంటాడు. తమ సంస్థ తరఫున ఆయన కర్నాటకలోని గ్రామీణ, పట్టణ ప్రాంతాలలోని స్కూళ్లకు వెళ్లి తపాలా బిళ్లల సేకరణ గురించిన అవగాహన పెంపుకు కృషి చేస్తున్నాడు. కర్నాటక ఫిలాటలీ సొసైటీ వర్క్‌షాపులను నిర్వహించ డమే కాదు, ప్రస్తుతం ఫిలాటలీ హాబీగా ఉన్నవారు వర్క్ షాప్‌లలో పాల్గొనేందుకు, తమ హాబీలో ముందుకు సాగేందుకు, జాతీయ, అంతర్జాతీయ ఎగ్జిబిషన్‌లలో పాల్గొనేందుకు తోడ్పడుతుంది. ఫిలాటలీ, స్టాంప్ ఆర్ట్ అవినాభావ సంబంధం కలవి. మరి తనయుడు ఫిలాటలీలో, తల్లి స్టాంప్ ఆర్ట్‌లో విశేష కృషి చేసి, పేరొందటం ఎన్నదగ్గ విషయం. ■

(అచంచల ప్రేమ...15వ పేజీ తరువాయి)

ఉంటానని ప్రమాణం చేసిన వ్యక్తి, తన భార్యను కాకులకు, గద్దలకు వదిలేయటం ఎప్పుడయినా విన్నావా? అలాంటి మనిషిని ఎక్కడయినా చూశావా?' ప్రశ్నించింది.

బాహుకుడు తల వంచుకున్నాడు. కాస్సేపటికి లోగొంతుకలో అన్నాడు. 'ఈ ప్రపంచంలో ప్రతి కార్యానికి కారణం ఉంటుంది. కొన్నిటికి కారణాలు భౌతిక ప్రపంచంలో ఉంటాయి. మరికొన్నిటి కారణాలు మనకు కనబడని మరో ప్రపంచ శక్తులపై ఆధారపడి ఉంటాయి. అందుకే కొన్నిటికి కారణాలు వివరించగలుగుతాము. కొన్నిటికి వివరించలేము' అన్నాడు.

దమయంతి హృదయంలో ఒక అనిర్వచనీయమైన భావన తరంగంలా ఎగిసిపడింది. 'నన్ను వదలి ఎలా మనగలిగారు?' అడిగింది గద్గదిక కంఠంతో.

'జీవచ్ఛవంలా. నువ్వెక్కడో హాయిగా ఉండి ఉంటావన్న ఆశతో..' గొంతు బొంగురుపోయింది అతడికి.

'ప్రాణం వదలి వెళ్లిన శరీరం సుఖంగా ఉండగలదా?' అడిగిందామె.

'శరీరంలేని ఆత్మకు అస్తిత్వం ఉంటుందా ఈ ప్రపంచంలో?' అడిగాడతడు.

'మరి ఇప్పుడు నా ఎదురుగా ఉన్నది ఎవరు?'

'మరణం లేని ప్రేమ వల్ల బతికి ఉన్న ఆత్మ'

'ప్రేమ కారణంగా ఆత్మకోసం తపిస్తున్న జీవిని నేను. ఇంకా ఎందుకు నన్ను బాధిస్తారు?'

'నేను నిన్ను బాధిస్తే నన్ను బాధించుకుంటున్నట్టే. నువ్వు నేను అన్న భేదం ఎప్పుడో పోయింది' అన్నాడు బాహుకుడు.

దమయంతి అతడిని అల్లుకుపోయింది. నలుడు ఆమె చెవిలో గుసగుసగా అన్నాడు..'నన్ను క్షమించు. నా దురదృష్టం నీడలా నన్ను వెంటాడుతూంటే, దాని నీడలో నువ్వు మగ్గకూడదని నా దుష్టపు నీడను నావెంట నీకు దూరంగా తీసుకువెళ్లాను'.

'మన ఇద్దరి అదృష్టాలు, దురదృష్టాలు పెనవేసుకుపోయినప్పుడు ..ఆ నీడ మీ ఒక్కరిదీ కాదు, మన ఇద్దరిదీ అని గ్రహించలేకపోయా రా?' అడిగిందామె.

'నిన్ను కష్టపెట్టకూడదు, కష్టంలో నిన్ను చూడలేనన్న భావన, నీపై ప్రేమ నా విచక్షణను హరించింది'.

'మీకు దూరంగా బతకాల్సి రావటాన్ని మించిన కష్టం ఇంకేదీ లేదని తెలియలేని మీకు ప్రేమ స్వరూపం తెలుసా? అని అనుమానం వస్తోంది' అంది దమయంతి.

'ప్రేమ స్వరూపం అనంతం. అది భిన్నమైన రూపాలలో చిత్ర విచిత్రాలుగా ఉంటుంది. దాన్లో నాదో కోణం, నీదో కోణం' అన్నాడు నలుడు.

'అయితే మన ప్రేమ అసంపూర్ణం. ఇద్దరం ఒకే కోణంలో చూడగలగటం కోసం కలసి ప్రయత్నిద్దాం ఇకపై' అంది దమయంతి.

************

అలా సుఖాంతమయింది ప్రపంచవ్యాప్తంగా అసలైన ప్రేమకు సిసలైన ఉదాహరణగా నిలిచే నల దమయంతుల ప్రేమగాథ. ■



కథ

# దొంగలు

– శేషచంద్ర

**టోల్ గేటుకు సుమారు ఫర్లాంగు దూరంలో ఉంది ఆ దాబా హోటల్. దానికి దగ్గర్లోనే కాదు... చుట్టుపక్కల యాభై కిలోమీటర్ల వరకు మరో హోటల్ లేదు. విశాలమైన స్థలంలో పచ్చని చెట్ల మధ్య చల్లని వాతావరణంతోపాటు మందు కొట్టేందుకు ప్రత్యేక సదుపాయం కూడా ఉండటంతో రాత్రిళ్లు 12 గంటల వరకు వాహనాలతో, కస్టమర్లతో రద్దీగా ఉంటుంది ఆ హోటల్. అంత రద్దీలోనూ ముసలయ్య హుషారుగా తిరుగుతూ, తన కొడుకు కౌంటర్ దగ్గర కూర్చుని డబ్బులు వసూలు చేస్తుంటే ఇద్దరి పిల్లలతో దాబా నడుపుతున్నాడు.**

దాబా వెలిసిన నెల రోజుల నుంచి ఎప్పుడూ రద్దీగా ఉండే ఆ దాబా ఎందుకో ఈరోజు పది గంటలకే బోసి పోయినట్లుంది. ఒక్కడంటే ఒక్కడు ఓ మూల ఏర్పాటు చేసిన క్యాబిన్‌లో కూర్చుని మందుతో కుస్తీ పడుతున్నాడు. వాడు ఐదు నిమిషాలకోసారి గ్లాసులో మందు గుటక వేస్తూ, ఎడమ చేత్తో ఓ పకోడి ముక్కను సుతారంగా అందుకొని నోట్లో పెట్టుకొని నములుతూ, దానికితోడు సిగరెట్టు పొగను గుండెలనిండా పీల్చుకొంటూ తన లోకంలో తాను విహరిస్తున్నాడు. వాడు వదిలిన సిగరెట్టు పొగతో దాబా అంతా లోపల మసక మసకగా కనిపిస్తోంది.

"తినేందుకు ఏమైనా తెమ్మంటారా బాబూ?" అని అడిగాడు ముసలయ్య. అలా అడగటం అది మూడోసారి. వాడిలో ఉలుకూ లేదు పలుకు లేదు. ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో అన్న ధ్యాసే లేదు. శూన్యంలోకి చూస్తూ గ్లాసులోని ద్రవాన్ని చుక్క చుక్క అమృతంలా ఆస్వాదిస్తూ సేవిస్తున్నాడు. రెండు మూడు రోజులకొకడు ఇలాంటివాడు తగుల్తుండటంతో వాడి గురించి పెద్దగా ఆలోచించలేదు ముసలయ్య. అతని ఆలోచనంతా వ్యాపారం మీద ఉంది. కస్టమర్లు ఎవరూ రాకపోవటంతో దిక్కు తోచలేదు. రోడ్లమీద వాహనాలు తిరుగుతున్నాయి కానీ ఒక్క వాహనం కూడా హోటల్ దగ్గర ఆగడం లేదు. ఏమైంది... ఈ రోజు తను హోటల్ పెట్టినప్పటినుండి ఇంత దల్ వ్యాపారం ఎప్పుడూ లేదు. మరో హోటల్ పడి బిజినెస్ తగ్గిపోకముందే నాల్గు రాళ్లు వెనకేసుకోవాలని తాపత్రయపడ్తూ రాత్రింబవళ్లు కష్టపడుతున్నా ఒకోరోజు జరిగే బిజినెస్ కలవరపెడుతుంది ముసలయ్యను. ఆ హోటల్‌కు అతనే ఓనర్ కమ్ వంటమనిషి కమ్ సర్వర్.

ఒంటిపైన మాసిన బనియను, దానిపైనో తుండుగుడ్డ, పొట్టినిక్కరుతో నున్న పిల్లోడితో "రోడ్డుమీదకు వెళ్లరా! వెళ్లి, వచ్చిపోయే వెహికల్స్‌ను ఇక్కడ దాబా హోటల్ ఉందన్న విషయం అర్థమయ్యేలా గట్టిగా అరుస్తూ నిలబడు" అన్నాడు.

ముసలయ్య ఆ మాట చెప్పగానే వాడు రోడ్డుమీదకు వెళ్లాడు. వస్తున్న, పోతున్న వాహనానికి చేయి అడ్డంగా చాపుతూ విజిలేస్తూ "వేడి వేడి భోజనం, రోటీ రెడీ సార్" అని అరుస్తూ టార్చి లైట్‌తో బోర్డు వైపు లైట్ వేసి దాబా హోటల్ గురించి తెలిసేలా చేస్తున్నాడు. పాపం... వాడి ప్రయత్నం ఏమాత్రం ఫలించడం లేదు. విజిల్ శబ్దానికి వెళ్తున్న వాహనాలు కొద్దిగా స్లో అయినా ఆ తరువాత తమ దారిన వెళ్లిపోతున్నాయి. అరగంటపైనే పోయింది. కస్టమర్లు వచ్చే జాడ కనపడలేదు. ముసలయ్య హోటల్ బైటికి వచ్చి అరుగుమీద కూర్చుంటూ బీడి తీసి వెలిగించాడు. అమావాస్య చీకటి. హోటల్ ముందు పాతిన కొయ్యకున్న బల్బుచుట్టూ కొద్దిమేర వెలుతురు పరుచుకొని ఉంది. ఆ పైన నల్లని చీకటి తప్ప ఏమి కనపడటం లేదు. ముసలయ్య వదలిన బీడి పొగ చీకట్లో కలిసిపోతుంది. చేతిలోని బీడికి పట్టిన బూడిదను విదిలిస్తూ చుట్టు ఉన్న పరిసరాలను చూస్తూ విరక్తిగా నవ్వుకొన్నాడు ముసలయ్య. ఎంత మార్పు? కలలో కూడా ఊహించలేదు ఇలా జరుగుతుందని. ఆర్నెల్ల క్రితం తన జీవితం ఎంత హాయిగా సాగేది. ఉదయం నుంచి సాయంత్రం వరకు పాలేర్లకు, పొలంలో కూలీలకు పనులు చెప్పి, చేయిస్తూ చీకటి పడగానే కూలీలకు ఇవ్వాల్సిన డబ్బులు పంచేసి భార్య, పిల్లలతో కొద్దిసేపు సంతోషంగా గడిపి, షవర్‌కింద వేడినీళ్ల స్నానం చేసి పిల్లలతో పాటు తృప్తిగా భోంచేసి, మేడపైన మెత్తని పరుపుమీద పడుకొని ఖరీదైన సిగరెట్టు తాగుతూ చీకట్లో చుక్కలను చూస్తూ తొమ్మిది గంటలకే నిద్రలోకి జారిపోయే వాడు. కానీ ఇప్పుడు లక్షలు పంచిన చేతులు పది పరకాకోసం రాత్రింబవళ్లు వళ్లు హూనం చేసుకొని వచ్చిన ప్రతి ఒక్కడి ముందు వినయంగా నిలబడి నౌకరుగా పని చేయాల్సి వస్తోంది.

కష్టమంటే ఏమిటో తెలియని జీవితం గడిపిన తనకు ఇప్పుడు సుఖం అనేది దక్కుతుందా? అన్న ప్రశ్నకు సమా ధానం వెతుక్కోవాల్సి వస్తున్నందుకు మనసు ఆర్ద్రంగా మారి సన్నటి కన్నీటి పొర కమ్మింది.

ముసలయ్యది కడపజిల్లా మైదుకూరు. ఒకప్పుడు బాగా బతికిన మనిషి. పది ఎకరాలు కెసి కాలువ కింద మాగాణితో పాతిక ఎకరాల మెట్ట; పాడి–పశువులు, పాలేర్లు; చీకు–చింతా లేని జీవితం గడిపేవాడు.



ఇద్దరు పిల్లలు. పెద్దోడు పది, చిన్నోడు ఎనిమిది. ఉండూరులోనే చదువు. ఆదాయమే తప్ప ఖర్చు పెద్దగా లేకపోవటంతో మైదుకూరులో ఓ మోస్తరు షావుకారిగానే చలామణి అయ్యేవాడు. అవసరమన్నవాళ్లకి లేదనకుండా సహాయం చేసి మైదుకూరులో మంచి పేరు సంపాదించాడు. అలాంటి సమయంలోనే అన్ని చోట్ల భూముల ధరలకు రెక్కలొచ్చినట్లే ఇక్కడ విపరీతమైన రేట్లు పెరగడంతో చాలా మంది బ్రోకర్ల అవతారం ఎత్తి లక్షలు, కోట్లు సంపాదించి, కూటికి గతిలేని వాళ్లంతా మోటార్ బైకుల్లో, కార్లలో ఝాం అని తిరుగుతుండటంతో ముసలయ్యకు ఆశ పుట్టింది. డబ్బు, పలుకుబడి పెట్టుకొని తను చేతకాని వాజమ్మలా ఎందుకుండాలను కొన్నాడు. రియల్టరుగా మారాడు. ముందుగా రెండు మూడు చోట్ల భూములు కొని రిజిస్టరు కాకముందే వాటిని మంచి లాభాలతో అమ్మడంతో ఆ వ్యాపారంపై విపరీతమైన నమ్మకం ఏర్పడింది. కొద్ది రోజుల్లోనే కోటీశ్వరుడు కావొచ్చుని వెనక ముందు ఆలోచించకుండా బ్రోకర్ల మాటలు విని ఎందుకూ పనికిరాని భూములను కూడా కొనడం మొదలుపెట్టాడు. తన దగ్గర డబ్బులు కాకుండా అందిన చోటంతా లెక్కకు మించి వడ్డీ పెట్టి అప్పు తెచ్చి మరీ భూములు కొన్నాడు. కానీ అతని ఆశలు తలకిందులు చేస్తూ ఒక్కసారిగా రియల్ ఎస్టేట్ బిజినెస్ కుప్పకూలిపోవడం మొదలైంది. దాంతో ముసలయ్య తల రాత తిరగబడింది. భూముల రేటు ఆకాశం నుండి పాతాళానికి పడిపోవటంతోపాటు, అప్పు ఇచ్చినవాళ్ల వత్తిడి ఎక్కువ కావటంతో తప్పని పరిస్థితిలో ఉన్న పది ఎకరాల మాగాణి, ఇండ్లు, పశువులు అమ్ముకోక తప్పలేదు. తనకున్న, తను కొన్న భూములు కూడా తక్కువ ధరకు అతి కష్టమ్మీద అమ్ముకొన్నా బాకీలైతే అన్నీ తీర్చాడు కానీ సర్వం కోల్పోయి, ఉండూరిలో బతకను ముఖం చెల్లక ఉన్న కొద్ది డబ్బులతో భార్య, పిల్లలను వెంట పెట్టుకొని ఆలాంఖాన్ పల్లెకొచ్చి అక్కడ దాబా హోటల్ తెరిచాడు. అక్కడ ఓ వంట వాడిగా, సర్వర్‌గా సాగుతున్న తన జీవితాన్ని తలుచుకొని బాధపడని రోజు లేదు. కష్టపడి మళ్లీ పూర్వపు స్థితికి రావాలని తాపత్రయం. కానీ ఒకోరోజు జరుగుతున్న బిజినెస్ అతనికి ఆందోళన గురి చేస్తోంది. ఇప్పుడే ఇలా ఉంటే రేపెప్పైనా మరొక హోటల్ పోటీకి పడితే, వాడు ఒకవేళ డబ్బున్న వాడైతే వాడికి తను పోటీ ఇవ్వగలడా అనుకొని భయపడసాగాడు. ఆ రోజు పరిస్థితి మరీ ఆందోళన కలిగిస్తోంది అతనికి. వండిన బిర్యాని, తడిపిన గోధుమ పిండి, చికెన్ ఏమాత్రం ఖర్చు కాలేదు. ఉదయం నుండి వ్యాపారం బాగానే జరిగింది రాత్రికి కూడా బాగా జరిగుంటే ఓ ఇరవై వేలు పెట్టి ఫర్నిచరు తెచ్చుకోవాలనుకొన్నాడు. ఫర్నిచరు తెచ్చుకోవటం అటుంచి, నష్టం వచ్చేటట్లుంది. బైట విచారంగా కూర్చుని బీడి తాగుతున్న ముసలయ్యను చూస్తూ కౌంటరు దగ్గర కూర్చున్న అతని పెద్ద కొడుకు కేశవులు "ఈరోజు బేరం పూర్తి ఎత్తిపోయేటట్లుంది. వండినదంతా అట్లాగే ఉండిపోయింది" అన్నాడు. కేశవుల మాటతో ఆలోచనల నుంచి బయట పడ్డ ముసలయ్య ఆరిపోయిన బీడిని విసిరేసి, అరుగుమీద నుండి పైకి లేస్తూ "ఏం చేద్దాం? రాత్రి పన్నెండు కావస్తుంది. ఇక వ్యాపారం జరుగుతుందన్న నమ్మకం లేదు. ఇక ఎవరైనా కస్టమర్లు వచ్చినా వాళ్లు టీ బిస్కెట్ తప్ప మరేమి తీసుకోరు ఆ పిల్లగాడ్ని పిలిచి వాడితోపాటు నువ్వు కాస్త ఎంగిలి పడండి. ఏం చేస్తాం? మనకి ఎట్టా రాసి ఉంటే అట్టా జరుగుతాది" అని కొద్దిసేపు రోడ్డువైపే చూసి, నిరాశగానే హోటల్ లోపలికి వచ్చాడు. లోపలనున్న కస్టమర్ నింపాదిగా శూన్యంలోకి చూస్తూ కొద్తానే ఉన్నాడు. వాడ్ని చూస్తూ "ఒర్నీ ఈడేంది రెండు క్వార్టర్లు తెల్లార్లు తాగేటట్లున్నాడు" అని విసుక్కొంటూ-

"చూడు బాబూ! నీకేమైనా తినేందుకు కావాలా? లేకపోతే త్వరగా తాగేసెయి. హోటల్ మూసేస్తున్నాం" అన్నాడు. అలాగైనా వాడు త్వరగా ముగిస్తాడని. లేకపోతే తాగి తాగి ఆడ్నే పడిపోతే వాడితో మరో ఇబ్బంది. దానికి వాడు మత్తుగా తల పైకెత్తి చూస్తూ, గ్లాసులోని చివరి చుక్క నోట్లో పోసుకొని-

"ఏంటి? హోటల్ అప్పుడే మూసేస్తున్నావా?" అన్నాడు

"అవును రాత్రి పన్నెండు కావస్తోంది...."

"సరే సరే... ఏమున్నాయ్" అన్నాడు.

"బిర్యానీ, చికెన్, రోటీ అన్నీ వేడిగానే ఉన్నాయి. బిర్యానీ ఓ ప్లేటు చికెన్ రోస్టు తెచ్చేదా?" అన్నాడు ఆశగా. కనీసం ఓ రెండు వందలైనా వ్యాపారం జరుగుతుందని.

"వద్దు... అవి అరగవుగానీ ఓ ఆమ్లేట్ వేసుకురా చాలు"

ముసలయ్యకు వాడిమీద, తనమీద జాలి వేసింది. చికెను, బిర్యానీ చాలా మిగిలిపోయి ఉంది. కనీసం కొద్దిగానైనా ఖర్చవుతుం దనుకొంటే వాడు ఆమ్లేటు అడుగుతున్నాడు. విసుగ్గా ఆమ్లేటు వేయాలని పోతూ, కాలికింద ఏదో పడ్డట్లు అన్పించడంతో కాలు పక్కకు తీసి చూచాడు. తొమ్మిది నెలల గర్భిణిలా నిండుగా ఉంది పర్సు. దాంట్లో కుక్కిన వెయ్యి రూపాయల నోట్లు బైటకి కన్పిస్తు న్నాయి. ఆ పర్సును చూసి ఆశ్చర్యపోయాడు. ఎవరిదై ఉంటుంద నుకొని ఆ తాగుబోతు వైపు చూచాడు. వాడు వాడి లోకంలోనే ఉన్నాడు. సీసాలో మిగిలిన మందు గ్లాసులో పోసుకొంటున్నాడు. ఆ పర్సు ఆ తాగుబోతుదే అని అన్పించింది ముసలయ్యకు. ఎందుకంటే చాలాసేపటి నుండి కస్టమర్లు ఎవరూ రాలేదు. పర్సు చేతికి తీసుకొని వాడ్ని పర్సు గురించి అడగబోయి ఆగిపోయిడు. నిండుగా, బరువుగా నున్న దాన్ని చూసి దాన్ని వాడినడగడానికి మనసు పుట్టలేదు. దాన్ని తన పైజామా జేబులోకి తోసేసాడు. మొదటి సారిగా దొంగతనం చేస్తున్న ఫీలింగ్ ఓ వైపు; మరోవైపు కానీ అది దొంగతనం ఎలా అవుతుంది. తను ఎవరి దగ్గరేం కొట్టేయలేదు. తనకు దొరికింది. ఎవరిదైంది తెలియదు. కాకపోతే తాను పర్సును గురించి వాడినడగలేదంతే! వాడిదేనని నమ్మకం ఏమిటీ? తనే ముందుగా అడిగితే మత్తులోనున్న వాడు తనదే అంటే వాడిది కాకపోయినా ఇచ్చేయక తప్పదు. ఒకవేళ వాడిదే అయితే వాడు అడిగితే ఇవ్వచ్చు అని సర్దిచెప్పుకొన్నాడు. వాడికి ఆమ్లెట్ వేసిచ్చి, తిన్నగా కౌంటర్ దగ్గరకు వచ్చి, పర్సు తెరిచి చూచాడు. పర్సునిండా అన్ని వెయ్యి రూపాయల నోట్లు. ముసలయ్యతోపాటు పర్సును అందులోని నోట్లని చూసి, "ఎవరిది నాన్నా! పర్సు?" అన్నాడు, కౌంటర్లో నున్న కేశవులు ఆశ్చర్యంగా.

"ష్...!" నోటిమీద చేయి వేస్తూ నెమ్మదిగా గొణిగాడు "ఆ టేబుల్ దగ్గర దొరికింది"

"ఆ టేబుల్ దగ్గర పడి ఉంటే అతనిదేనేమోనని అడగకపో యావా?" అన్నాడు.

"... ..." దానికి సమాధానం చెప్పకుండా మౌనంగా ఉన్న తండ్రిని చూస్తూ- "అతనిదిగాక మరెవరిదో అయివుండదు నాన్నా! ఎందుకంటే చాలా సేపటినుండి కస్టమర్లు రాలేదు కదా!" అన్నాడు.

"వాడిదేనని ఎందుకనుకోవాలి? ఉదయం చాలా మంది వచ్చారు కదా! వాళ్లది అయివుండే అవకాశం ఉంది కదా! టేబుల్‌కింద పడి ఉండేది మనకెలా తెలుస్తుంది? ఇప్పుడు బైటపడి ఉండవచ్చు కదా! నిజం ఏమిటో తెలుసుకోకుండా పూర్తిగా నిషాలో నున్నవాడ్ని అడిగితే వాడు నిజం చెప్తాడన్న నమ్మకం ఏమిటి? తనదే అంటే ఇచ్చేయాలి కదా!" లాజిక్ రంగు పూసి మాట్లాడాడు, ముసలయ్య. ఆ పర్సు తిరిగి ఇవ్వాలని లేదతనికి. సుమారు ముప్పై నోట్లు పైనే వచ్చాయి. వారం పది రోజుల బిజినెస్. బహుశా ఆ డబ్బు దొరికేందుకేనేమో సాయంత్రం నుంచి ఎవ్వరూ రాలేదు. డబ్బులు తిరిగి ఎవరికి ఇవ్వక పోతే ఫర్నిచర్ తెచ్చుకోవచ్చు, నాలుగైదు రోజులకు దినుసులొస్తాయి. ఈరోజు నష్టం భర్తీ అవుతుంది.... అనుకొంటూ పర్సు తీసి టేబుల్ కింద సరుకులు పెట్టుకొనే చోట వేస్తూ తనవైపే చూస్తున్న కొడుకును చూసి తల పక్కకు తిప్పుకొని గబగబా లోపలికెళ్లాడు.

ముసలయ్య తనకు దొరికిన పర్సును తిరిగి ఇచ్చేందుకు ఇష్టప డటంలేదని అర్థమైంది కేశవులకు. తండ్రిలో వచ్చిన మార్పును చూసి బాధపడ్డాడు. ఓసారి పొలం నుంచి ఇంటికి వస్తుండగా ఐదు లక్షల బ్యాగు దొరికితే దాన్ని పోలీసుల సాయంతో డబ్బు పోగొట్టుకొన్న వ్యక్తికి తిరిగి అందచేసి అందరి ప్రశంసలందుకొన్న తన తండ్రి, మైదుకూరు మండలంలోనే నిజాయితీకి మారుపేరుగా బతికిన మనిషి ముప్పై వేల కోసం కక్కుర్తి పడిపోతున్నాడా? నిజం అదే అయితే ఎలాగైనా తండ్రికి నచ్చచెప్పి ఆ పర్సును తాగుబోతుకు ఇచ్చేయాలి. పాపం... అవి అతని జీతం డబ్బులు కాబోలు. మందు కొట్టే అతని వాలకం చూస్తుంటే పెళ్లాం పిల్లలమీద ధ్యాస లేనట్టుంది అతనికి. దానికితోడు జీతం డబ్బులు మొత్తం పోతే నెలంతా అతని కుటుంబం పస్తులతో అగచాట్లు పడక తప్పదు.... అనుకొన్నాడు కేశవులు.

ముసలయ్యలో ఆలోచన మరోలా ఉంది. వాడికి పర్సు పోయిం దన్న సంగతి తెలియకపోతే, వాడు తన పర్సును అడగకుండా ఉంటే అది తన సొంతమైపోతుంది. అందుకే తాగుబోతు దగ్గర నిలబడి వాడ్ని తొందర చేయడం మొదలుపెట్టాడు. వాడు ఎంత త్వరగా బైటకి వెళ్తే అంత అవకాశముంది. అది తన స్వంతమైనందుకు అంత వరకు తనను పట్టించుకోని ముసలయ్య ఇప్పుడు తొందర చేస్తుండ టంతోపాటు, ఉన్నట్లుండి వాడిలో కూడా ఏదో మార్పు కనపడింది. త్వరగా తినేసి వెళ్లిపోవాలన్న ఆత్రుత కనపడింది. అందుకే గ్లాసులో మిగిలిన మందు ఒక్క గుక్కలో నోట్లో పోసుకొని, ఆమ్లెట్ నోట్లో కుక్కుకొని ప్లేటులో చేయి కడుక్కొని పైకి లేచాడు వాడు. మామూ లుగా అయితే కస్టమర్ తినడం పూర్తి కాగానే టేబుల్ దగ్గరే బిల్లు ఎంతో చెప్పి కొడుక్కు గట్టిగా కేక వేసి మరీ డబ్బు సంగతి చెప్పే వాడు ముసలయ్య. కానీ తాగుబోతు లేచి వెళ్తున్నా మౌనంగా ఉండిపోయాడు. తను డబ్బు అడక్కపోతే, మైకంలో వాడు బిల్లు చెల్లించకుండా పోతే, వాడికి పర్సు పోయిందన్న సంగతి తెలియ కుండా ఉంటుంది. ఒకవేళ వాడిని డబ్బు అడిగితే, వాడికి తన పర్సు పోయిందన్న సంగతి తెలిసిపోతుందేమో, అప్పుడు పర్సు ఇవ్వాలా. వద్దా? ఇవ్వకపోతే ఏమవుతుంది? తను తీసేది వాడేమైనా చూసాడా? పర్సును తన కొడుకు చూసేటట్లు తెరచి చూడకుండా వంట రూంలో పెట్టి ఉంటే సరిపోయేది అనుకొంటూ తాగుబోతు కౌంటర్ దగ్గరకు వెళ్లకముందే తను కౌంటర్‌కు అడ్డంగా నిలబడ్డాడు. వాడికి బిల్లు చెల్లించాలన్న విషయం గుర్తుకు రాకూడదని. కానీ ఆ తాగుబోతు ముసలయ్యను దాటుకొని ముందుకెళ్లి నిలబడి కౌంటర్ మీద నున్న సోంపు చేతినిండా తీసుకొని నోట్లో వేసుకొంటూ ఎంతైంది? అన్నట్లు నిలబడ్డాడు. ఇక తప్పేటట్లు లేదనుకొని "అయిదు వందలా ఇరవై" అన్నాడు, నీరసంగా ముసలయ్య. అంతేనా? అని వాడు వెకిలిగా నవ్వుతూ జేబులో చేయి పోనిచ్చాడు.

ముసలయ్య గుండె వేగంగా కొట్టుకోసాగింది. వాడు జేబులో చేయి పెట్టినా, వాడి ముఖంలో పర్సు పోయిందన్న ఫీలింగ్ కనపడకపో వటంతో కొద్దిగా కుదుట పడ్డాడు, ముసలయ్య.

వాడు చుట్టూ ఓసారి చూసి, జేబులోంచి చేయి బైటకు తీస్తూ "డబ్బు కావాలా?" అన్నాడు, వ్యంగంగా. వాడి చేతిలోని రివాల్వర్ నిగనిగలాడుతోంది.

* * *

రివాల్వర్‌ను చూసేసరికి నోట మాట రాలేదు ముసలయ్య, కేశవులకు.

"సాయంత్రంనుంచి ఏలాంటి బేరం జరగలేదు. మీరు కూడా రాలేదనుకొంటాం. మీరు డబ్బు ఏమి ఇవ్వక్కర్లేదు. మీరు వెళ్లండి. అంతేకాదు మీ.." అని వాడి పర్సు సంగతి చెప్పబోయాడు.

వాడి మాటలను మధ్యలోనే తుంచేస్తూ "అరే బుట్టోడా! నేను తాగి, తిన్నది ఎగ్గొట్టానికే రివాల్వర్ చూపిస్తాననుకొన్నావ్ బే! మర్యా దగా మీ దగ్గరున్న క్యాష్ మొత్తం ఇటిచ్చేయి"

రెండు క్వార్టర్లు తాగినా వాడిలో మత్తు లక్షణాలు ఏమాత్రం లేవు.

ఆ మాటకు ముసలయ్య అదిరిపడ్డాడు. వాడిని ఎదుర్కొనేందుకు ధైర్యం చాల్లేదు. సహాయం చేసేందుకు మనిషన్నవాడు ఎవరూ లేరు, చుట్టుపక్కల. అడ్డు చెప్తే కాల్చిపారేసి దోచుకపోయేలా ఉంది వాడి వాలకం. పక్కా ప్లాను ప్రకారమే సమయంకోసం వేచిచూస్తూ తాగినట్లు నటిస్తూ అంతసేపు ఉండిపోయాడని అర్థమైంది ముసలయ్యకు. వ్యాపారం జరగలేదని సాయంత్రం నుంచి బాధపడ్తుంటే, మూల్గే నక్క మీద తాటిపండు పడినట్లు పొద్దుట్నుంచి కష్టపడి సంపాదించిన హోటల్‌లో డబ్బు వాడు దోచుకొనేందుకు రివాల్వర్ చూపిస్తుంటే పర్సును మాత్రం వదుల్తాడా? అనుకొంటూ "అన్నా! బాగా బతికిన కుటుంబం మాది. చితికిపోయి ఏదో ఇలా వ్యాపారం చేసుకొంటున్నా. దయతలచి మమ్మల్ని వదిలేయి. కలెక్షన్ అయిన డబ్బులు నీకిస్తే రేపటి వ్యాపారానికి నా దగ్గర డబ్బుల్లేవు" దీనంగా ప్రాధేయపడసాగాడు, ముసలయ్య.

"ఛత్... నీ ఏడ్పులు ఆపి మర్యాదగా డబ్బులు ఇస్తారా? చస్తారా?" అని అరిచాడు వాడు, ఏమాత్రం జాలి చూపకుండా.

"ముసలయ్యతోపాటు తను ఎంత ప్రాధేయపడినా ఫలితం లేకపోవడంతో క్యాష్ కౌంటర్లో డబ్బు మొత్త పది వేలా చిల్లర తీసి అందించాడు కేశవులు. వాడు నోట్లను సర్దుకొని, వెనక జేబులో చెయి పెట్టి పర్సు తీయబోయి అదిరిపడ్డాడు!

పర్సు కనపడకపోవడంతో వాడిలో కంగారు ఎక్కువైంది. అన్ని జేబులు తడుముకొంటూ, "నువ్వుగాని పర్సు చూసావా నాది" అన్నాడు, కోపంగా ముసలయ్యను చూస్తూ.

"పర్సా? లేదన్నా!" అన్నాడు, నీరసంగా ముసలయ్య, కొడుక్కు ఒక రకమైన సందేశమిస్తూ.

తాగుబోతు ముసలయ్య వీపుకు రివాల్వర్ ఆనిచ్చి లోపలికి పోతూ కేశవుల్తో "అల్లరి చేసి వెధవ్వేషాలు వేస్తే ముసలోడి పుచ్చ లేచిపోద్ది, జాగ్రత్త" అని హెచ్చరించి లోపలికి నడిచాడు, తను కూర్చున్న చోట్లో పడిపోయిందేమోనని వెతికేందుకు. అక్కడ కనపడకపోవటంతో వంట చేసేచోట, పాత్రలు పెట్టేచోట, చిన్న చెక్క బీరువాలో క్యాష్ కౌంటర్ దగ్గర అన్ని చోట్ల వస్తువులన్నీ చిందర వందర చేసి మరీ వెతికాడు డాబా మొత్తం. ఆ తరువాత ముసలయ్యను, అతని కొడుకును ఇంకో పిల్లోడితో కలిసి అందరి దగ్గరా వెతికాడు. ఎక్కడా కనపడకపోవ డంతో వెర్రి పట్టినట్లయింది వాడికి. తన తలరాతను తిట్టుకొంటూ చీకట్లో నిలబెట్టిన మోటర్ బైక్ ఎక్కి వెళ్లిపోయాడు.

వాడు పోయిన కొద్దిసేపటికి తేరుకొన్నాడు, ముసలయ్య. కేశవుల వంక చూడలేక తల దించుకొని పర్సుకోసం తను దాచిన చోట వెతికాడు. పర్సు కనపడకపోవడంతో కంగారుపడ్డాడు. పర్సు కోసం తాగుబోతు, ముసలయ్య లోపలికి వెళ్లినప్పుడు, టేబుల్ కింద పెట్టిన పర్సును తీసి కంపల్లో విసిరేసాడు కేశవులు, తను చేస్తున్నది మంచిదా, చెడ్డదా అన్న ఆలోచన పక్కన పెట్టి. తాగుబోతు వెళ్లిపోయాడని నిర్ధారించుకొన్నాక కంపలో విసిరేసిన పర్సును బైటకు తీసాడు కేశవులు.

వణుకుతున్న చేతుల్తో తాగుబోతు తమ దగ్గర దోచిన డబ్బులు మాత్రం తీసుకొని, మిగిలిన మొత్తం ముసలయ్యకిస్తూ "నేను కూడా తప్పు చేసానేమోననిప్పిస్తోంది. కానీ తప్పనిసరై చేసాను. పర్సు వాడు అడకముందే ఇచ్చాయాలనిపించినా, వాడి ప్రవర్తన చూసి అలా చేయక తప్పలేదు. మనది కాని ఆ డబ్బు మనకొద్దు నాన్నా! ఏదైనా అనాథాశ్రమానికి ఇచ్చేద్దాం. అంతేకాదు.... ఇకనుంచి మందు అమ్మడం కూడా మానేద్దాం. కష్టపడి నిజాయితీతో సంపాదించింది చాలు" అన్నాడు, కేశవులు.

ఆ మాటలకు ముసలయ్య మౌనంగా తల ఊపుతూ ఖాళీ పర్సును దూరంగా చీకట్లోకి విసిరేసాడు, తన చెడు ఆలోచనలతోపాటు.

■

# ఈ వారం కవిత్వం

## శ్రీకారం

**మనిషి** మనుగడలోన మంచినే పొందాలని
ప్రతీవారూ రాస్తారు శ్రీకారం చుట్టి
కీడునే శంకించు ప్రతి క్షణము మనస్సు
మంచి భావనలకోసం శ్రీకారమే రాస్తాము.

ఏది రాసినా, పలికినా శ్రీకారముండాలి
లక్ష్మీ స్వరూపమంతా శ్రీకారముంటుంది
భారతం పుట్టింది శ్రీవాణి శ్లోకంతో
అందుకే శ్రీలక్ష్మిని గుండెలపై విష్ణువు
ధరియించినాడు

మనిషి శరీరంలోన చైతన్యముంటే
జీవుడే దేవుడై విలసిల్లుచుండు
మానవ శరీర నిర్మాణాన్ని బ్రహ్మదేవుడు గూడ
శ్రీకారం చుట్టియే ప్రారంభించినాడు

అందమైన రూపము అమిత సంపద గాదె
అందరికీ వుండాలి రూప సంపదలన్ని
స్త్రీల రూపంలోన అందాలు పొందివుంటే
సాక్షాత్తూ శ్రీమహాలక్ష్మిదేవియేనని పొగుడుతుంటాము

శ్రీకారమంటేనే మంగళం మనకు
కుశలము క్షేమము అందులోనే వున్నాయి
సంపదా, సభ్యతా శ్రీకారమే కాదా
శ్రీకారమంటేనే పూజ్య భావం మనకు

అందరిళ్లూ వెలగాలి శ్రీనిలయమై మీకు
స్త్రీ జాతియంతా శ్రీలక్ష్ములై ఉండాలి
అందరి మనస్సుల్లో నిలవాలి శ్రీకార భావన
కలకాలముండాలి నా కవితా శ్రీకారం

– కె.ఎస్.ఆర్.మూర్తి

---

## బలహీనత

**అదే** మీకు వరం!
కొన్ని కలల్ని,జ్ఞాపకాల్ని
ఇక్కడే వదిలేసి
ఊహల ప్రపంచంలో తిరుగాడే
ప్రేమికుని అమాయకత్వానికి
కాసింత ఆశ్చర్యపోతూ..
ఒకింత ఓరగా నవ్వుకుంటూ..
వలస పోయే రంగుల పక్షుల్లా
ఎటో ఎగిరిపోతారు.
ఈ కొమ్మను, ఈ తోటను
తేలిగ్గా మరచిపోతారు
బహుశా! నూతన గీతాలాపన
మీ అస్తిత్వంలో ఒక భాగమేమో!

శిశిరాలు తట్టి వెళుతున్నా
గత స్మృతుల వసంతగీతాలు
పాడుకుంటూ
పగలూ, రాత్రి కరిగిపోయిన కలల్లోనే
విహరిస్తూ వుంటాం.
ఈ మోహ రుగ్మత నుంచి
మా దేహాలు కోలుకోలేవు
మనస్సుని దేహాన్ని వేరు చేసి
ఈ రుగ్మతను తేలిగ్గా తెంపివేసుకునే
మీ గడుసుతనం
మాకూ ఉంటే ఎంత బాగుండు!

– తోట శ్రీనివాసరావు

---

## భూగ్రహాన్ని రక్షించుకొందాం!

**అవనీతల** పర్యావరణం చిన్నాభిన్నమైతే
అందరం నాదనుకున్న ఈ నేలకు దూరమైనట్టే
మనిషి ఆవాసం ఇంకోచోట వెతుక్కోవలసిందే
శాస్త్రజ్ఞులు భూగ్రహాన్ని పోలిన గ్రహాలకొరకు
అహర్నిశలు ప్రత్యామ్నాయాలు వెదుకుతున్నారు
సుదూర అంతరిక్షంలోనికి క్షిపణులు ప్రయోగిస్తున్నారు
శక్తివంతమైన దూరదర్శినులతో నిశితంగా అన్వేషిస్తున్నారు
అంగారక గ్రహంలో చంద్రమండలంలో ఉండటానికి
గృహాలు ఎలా
ఉండాలో
ప్రణాళికలు సిద్ధం
చేస్తున్నారు
ఏకంగా
గ్రహాలమీద స్థిరాస్తి అమ్మకాల ప్రకటనలు
అక్కడికి రాకపోకలకు అయ్యే ఖర్చుల అంచనా వేస్తున్నారు

ఈనాటికి ఏ గ్రహంలోనూ ప్రాణుల జాడ లేదు
ఖచ్చితంగా అక్కడి వాతావరణ పరిస్థితులు తెలియవు
అయినా ఊహాజనిత ప్రతిపాదనలకు కొదవ లేదు
ఊహలకు రెక్కలు మొలిచిన సందర్భం ఇది.

భూగ్రహం కన్న ముందు ఆవిర్భవించి పరిణతి చెందిన
జీవులతో
మేథోసంపత్తితో గ్రహాంతరవాసులు నిజంగా ఉంటే మాత్రం
మనిషి విజ్ఞానం వారిముందు ఇసుమంతే అవుతుంది
గ్రహాంతరాళాల్లో పొగధూళిని చల్లిన మనిషిని
భూగ్రహ కాలుష్య దుర్గతికి పాల్పడిన మనిషిని
ప్రకృతి రమణీయతనే విధ్వంసం చేసిన మనిషిని
మానవతనే విస్మరించి యంత్రంగా మారిన మనిషిని
గ్రహాంతర వాసులు
క్షమించరు అక్కున
చేర్చుకోరు
వణికిస్తున్న ఈ శాస్త్ర
సాంకేతిక పరిజ్ఞాన
విస్మృతి
ఎవరి స్వప్నాలకొరకు ఎవరి ఉజ్వల భవిష్యత్తుకొరకు?
ప్రశ్నలకు జవాబు దొరకని సందిగ్ధ ప్రశ్నలివి
నిర్విఘ్నంగా జరిగిన విధ్వంసం జరుగనే జరిగింది
ఇప్పటికైనా చితికిలపడుతున్న భూగ్రహాన్ని రక్షించుకొందాం.

– ఆచార్య పసుల వెంకటరెడ్డి

సింగిల్ పేజీ కథ

# అప్పట్లో ఉండేవాళ్లు...

– సురేంద్ర దేవ్ చెల్లి

**"ఏవండీ!** కాస్త ఇలా వచ్చి కూర్చోండి" అంటూ ల్యాప్టాప్‌తో కుస్తీ పడుతున్న అర్జున్‌ని పిలిచాను.

"ఆఫీస్ వర్క్ చేస్తున్నాను" అని తన పనిలో తలమునకలు అయ్యాడు.

"ఆఫీస్ టెన్షన్స్ ఎప్పుడూ ఉండేవే కదా! ఒక్క క్షణం నీతో మాట్లాడాలి" అని మా మధ్య వచ్చిన కమ్యూనికేషన్ గ్యాప్‌ని గుర్తు చేసాను.

"సరే... ఏంటో చెప్పు చిత్రాంగదా" అనుకుంటూ నాతోపాటు నా ట్రాలీని సర్దుతున్నాడు.

రేపు మా రీసెర్చ్ టీంతో కలిసి ఫీల్డ్ విజిట్‌కి వెళుతున్నాను, రెండు మూడు రోజుల్లో వచ్చేస్తాను. భోజనానికి ఇబ్బంది పడితే, పక్కింట్లో లక్ష్మిగారికి 'వాళ్ల ఇంట్లో మీకు వంట చెయ్యమని' చెప్పనా?

"నేనేం చిన్నపిల్లాడిని కాదు" అంటూ నా జాగ్రత్తల చిట్టాకు బ్రేకులు వేసాడు అర్జున్.

"సరే... మన ఇళ్ల జాగ్రత్త" అని అనగానే మా మధ్య నవ్వుల పువ్వులు పూసాయి.

"ఇప్పటికే బాగా పొద్దు పోయింది. రేపు తెల్లవారుజామున నీ ప్రయాణం కదా, త్వరగా నిదురపో" అంటూ లైట్స్ ఆపేసి, అర్జున్ స్టడీ రూమ్‌లో ఆఫీస్ వర్క్ చేసుకోవడానికి వెళ్లిపోయాడు.

"కనురెప్పల కరచాలనంలో అప్పుడే తెల్లారిపోయిందా?" అనుకునేలా ఎవరింటినుండో సుప్రభాతం వినిపిస్తోంది. టైం బౌండ్ జీవితాలు కదా!

పికప్ చేసుకోవడానికి కార్ వచ్చేలోపు అర్జున్‌కి టిఫిన్ రెడీ చేసాను. హార్న్ వినిపించేసరికి "నేను త్వరగా వచ్చేస్తాను. నువ్వు జాగ్రత్త" అని రిమైండర్ మెసేజ్ రాసి తను లేవకముందే వెళ్లిపోయాను. ఇంట్లోనుండి బయలుదేరడానికి మునుపు నల్లమల చేరుకోవడం వరకు గుండెల్లో ఏదో తెలియని ఆందోళన. చిట్టచివరకు వాగుల మెలికలు దాటుకుంటూ, గుట్టను ఎక్కి దిగుతూ, పచ్చటి వాతావరణంలో ప్రశాంతమైన బతుకులను పలకరించడానికి నల్లమల నడిబొడ్డున చెంచుల పెంటలకు చేరుకున్నాం.

"అడవిలో కాసిన వెన్నెల వ్యర్థం అన్నోడికి... అడవంటే ఏంటో తెలుసా?" అంటూ నాతోపాటు రీసెర్చ్ చేస్తున్న సుప్రియ కోపంగా అంది.

"ఇక్కడ చంద్రుడిని బాలుడని అంటారు కూన" అని పెంట పెద్దాయన మాకు చెప్పారు.

"మీ గుడిసెల ఆకారం భిన్నంగా ఉందేంటి?" అంటూ నేను అడిగాను.

"శంకు ఆకారం తల్లి. భారీ వర్షాల నుండి భీకర గాల్పులనుండి కొండంత రక్ష" అని పెద్దాయన ప్రకృతికి దండం పెట్టాడు.

"తొలకరొచ్చింది... పెద్దమ్మ జాతర శోభ లేదేంటి?" అంటూ మా ప్రాజెక్ట్ డైరెక్టర్ పెంట పెద్దాయనకు కొబ్బరికాయను ఇస్తూ అడిగారు.

"ముందు మీరు విశ్రాంతి తీసుకోండి" అని పెద్దాయన మా బాధ్యతను కొందరికి అప్పచెప్పాడు.

నేను, సుప్రియ, గూడెం ఆడపిల్లలు స్నానంకొరకు నదీపాయ దగ్గరకు వెళ్లాం. "నల్లమలలో పెద్దమ్మ జాతర గూర్చి చదువుకున్నాం. కానీ ఇక్కడ ఆ వాతావరణం లేదేంటి?" అని నేను అడిగాను.

ఇదివరకి ప్రతీ సంవత్సరం తొలకరిలో మోరిపప్పు, ఇప్పపూల సార, మేకపోతును కోసి సంస్కృతి ఆటలతో కిన్నెర వాయిద్యం, డప్పులతో సాంప్రదాయం ప్రకారం పెద్దమ్మను పూజించుకున్నాం.. అని చెప్పుతూనే... రంగి కళ్లలో కల్లోల సముద్రాలు.

"మరిప్పుడు ఎందుకు అలా చేసుకోవడం లేదు?" అంటూ ఆశ్చర్యంగా అడిగాను.

"అవేవి నాకు నోటికి తిరిగే పదాలు కావు తల్లీ. పెద్దాయననే అడగండి" అని రంగి చెప్పి ఊరుకుంది.

మా కోసం కొందరు వాళ్ల సాంప్రదాయ చెంబీత పాటలను ఆలపిస్తుంటే ఆఖరిలో 'తందానా' అంటూ వాళ్లతో శృతి కలుపుతున్నాం.

"మేం పుస్తకాలలో చదువుకున్న చెంచుల సంస్కృతికి, ఇక్కడ చూస్తున్న దానికి అసలు పోలిక లేదేంటి పెద్దాయనా!" అంటూ కెమెరాలో రికార్డింగ్ చేస్తున్నాను.

"ఏం చెప్పను? ఏమని చెప్పను... మా బతుకుల గురించి?" అంటూ మాట్లాడుతున్న పెద్దయ్య కళ్లల్లో కన్నీళ్ల కెరటాలు ఎగసిపడుతున్నాయి. అడవిలో బీడీ ఆకులను సేకరిస్తూ, చింతపండును, తేనెను సంతలో అమ్ముకునే అడవి బిడ్డలం. పండగొస్తే ఇప్పసారా తడిలో తడిసిపోతుంటాం.

ఇదంతా అప్పుడెప్పుడో పూర్వపు మాట. ఇప్పసారా కుండ మా దేవర ముందు పెడితే, దొంగ సారా కాస్తున్నామని బొక్కలో తోస్తున్నారు. వ్యవసాయం కొరకు భూమిని చదును చేస్తే గంజాయి పండిస్తున్నామని పట్టుకుపోతున్నారు. వేటగాళ్లు వస్తే ఆఫీసర్లకు చేరవేసేది చెంచులే గానీ, నేడు మేం కట్టెలకు అడవిలోకి పోతుంటే వన్యప్రాణుల పరిరక్షణా చట్టం ఉపయోగిస్తున్నారు. దీంతో నిన్న మొన్నటిదాక మమ్ములను మాయ చేసి అడవి ఉత్పత్తులకు పదో పరకో చేతిలో పెట్టిన దళారీలు మా సంతకు రావడమే మానేసారు.

"ఇలాంటి పరిస్థితుల్లో మీరు ఇంకా ఇక్కడెందుకు ఉంటున్నారు?" అనే నా ప్రశ్నకు–

"తాతల తరంనాటి నుండి ఈ అడవిలోనే జన్మించాం, ఇక్కడనే కళ్లు మూస్తాం" అనుకుంటూ ప్రాణాలు విడిచిన మా తండ్రుల జ్ఞాపకాలు నింపుకున్నది ఈ నల్లమల తల్లి.

"అయితే ఎంత కష్టమైనా ఇక్కడే ఉంటారా?" అనే నా ప్రశ్నకు ఆలోచించకుండా పెద్దయ్య "కానీ అది మాకు జరిగేట్లు లేదు" మీరేదో యురేనియం ఖనిజాన్ని మా పెంటల కింద గుర్తించారని, దానిని తవ్వడానికి మేం ఖాళీ చెయ్యాలని సర్కారోళ్లు పట్టుపడుతున్నారు.

"మరి ప్రభుత్వం మీ చెంచుల పెంటలను ఒక్కదగ్గరే చేర్చి ఉపాధి కల్పిస్తుంది. మీ పిల్లలకు చదువును చెప్పిస్తుంది కదా!" అంటూ సుప్రియ అడిగింది.

పక్షుల శబ్దాల ఆధారంగా కీడును అంచనా వెయ్యడం మా చెంచులకు వెన్నతో పెట్టిన విద్య. కానీ, మనిషి దుర్మార్గాన్ని అంచనా వెయ్యడంలో విఫలమయ్యాం.

"అరణ్యంలో రోదిస్తూ కూర్చునేకంటే రాజధానిలో పోరాటం చెయ్యొచ్చు కదా!" అంటూ నేను అడిగాను.

"రంగీ! ఇటు రాయే. గుడిసెలో ఆ దండేసిన మల్లిగాడి ఫోటో తీసుకురావే"....అందరం కలిసి నా కొడుకుని పట్నంలో చదివించాం. ఆడు మాకోసం పోరాటం చేస్తాడనుకుంటే సర్కారీ కొలువులో చేరి మా ఆశలపై నీళ్లు చల్లాడు. నిజాం ప్రభుత్వం 1940లో ప్రముఖ శాస్త్రవేత్త హైమన్ డార్ఫ్‌ని చెంచుల పరిస్థితిపై సమగ్ర పరిశోధన చెయ్యమని నియమించింది. నల్లమల మొత్తం చెంచు భూభాగంగా గుర్తించి చెంచులకే అధికారం ఇవ్వాలని కోరాడు. స్వాతంత్ర్యం తరువాత ఈ సలహాలు, సూచనలను ప్రభుత్వాలు గాలికొదిలేసాయి.

పెద్దాయన ఏడుస్తూ "ఎనభైలలో ప్రభుత్వాలు కుటుంబ నియంత్రణ ఆపరేషన్‌లతో మా అడవి బిడ్డల జాతిని అంతరింపచేయాలని చూశాయి. మా జాతికి నా కొడుకు చచ్చినోడు దానికి మించి ద్రోహం చేసాడు".

"ఇదిగో ఆ పాపిష్టోడి ఫోటో కూన" అని పెద్దయ్య చూపించాడు. సుప్రియ ఆ ఫోటో చూసి అరవబోతుంటే పక్కకు తీసుకువెళ్లాను.

"అది మీ ఆయన మల్లికార్జున్‌ది కదా" అని సుప్రియ అడిగేసరికి నా కన్నులలో నీళ్లు తిరిగాయి. ■

# పంకవేధ అంటే ఏమిటి?


**వాస్తువార్త**

వాస్తువిద్వాన్ సాయిశ్రీ

డా॥ దంతూరి పండరినాథ్

3-2-4, కింగ్స్‌వే, సికింద్రాబాద్- 3

సెల్స్: 9885446501/ 9885449458




**పంక ద్వారేశోకః** అని అంటారు. ప్రధాన ద్వారానికెదురుగా పంకము (బురద, అడుసు) వున్నట్లయితే ఆ గృహం 'పంక వేధ' అనే వాస్తు దోషం కలిగి వుంటుంది. పంకవేధా దోషపూరితమయిన గృహంలో నివసించేవారు శోకాన్ని, దుఃఖాన్ని పొందుతూ వుంటారు... అని అర్థం. గొయ్యి వున్న దగ్గరే బురద ఏర్పడుతుంది. బురద లేకున్నప్పటికీ ప్రధాన ద్వారానికి ఎదురుగా గోతులు వుండకూడదు. మామూలుగా వుండే గోతులే కాకుండా నీళ్ల సంపులు, బావులు, సెప్టిక్ ట్యాంకులు మొదలయినవి పూర్తిగాగానీ, పాక్షికంగా గానీ ప్రధాన ద్వారానికెదురుగా వుండకూడదు.

ప్రధాన ద్వారానికెదురుగా నడకలో గట్టి నేల వుండటం వలన మంచి ఫలితాలను ఆశించవచ్చు. ఒకవేళ ద్వారానికెదురుగా బురదగుంటలుగానీ, గోతులుగానీ వుండి శోకం, దుఃఖం, మనస్తాపం మొదలయిన దుష్ఫలితాలతో సతమతమవుతున్నవాళ్లు ఎవరయినా సరే ఆ గోతులను చక్కగా మట్టితో నింపి, చదును చేసి, గట్టి నేలగా తయారు చేసినట్లయితే ఆ దోషం తొలగిపోతుంది. అనతి కాలంలో దుష్ఫలితాలు తొలగిపోయి మంచి ఫలితాలు పొందటం ప్రారంభమవుతుంది. మంచి నిద్ర, మానసోల్లాసం, ఉత్సాహపూరిత ప్రవర్తనను పొందగలుగుతారు. తద్వారా అనేకానేక లాభాలు దరి చేరుతాయనటంలో సందేహం లేదు.

### ... గృహ నిర్మాణం చేయవచ్చా?

**మల్లేశం - చిత్తూరు**

ప్రశ్న: **ఉత్తర వాయువ్యం తగులుతున్న ఇంటిని తొలగించి, పడమర ఖాళీ స్థలం కలుపుకొని అప్పుడు ఉత్తరం, ఈశాన్యం వీధి తగులుతున్నదాంట్లో నూతన గృహ నిర్మాణం చేయవచ్చా?**

**జవాబు:** వీధి వెడల్పు దాదాపు ఇంటికి ఉత్తరం వెడల్పుకు సమానంగా వుంది. ఇలాంటి స్థలాలను వీధి మింగిన స్థలాలంటారు. ఇది వీధిచూపు కిందకు రాదు. కాబట్టి అక్కడ గృహ నిర్మాణం వాస్తురీత్యా కుదరదు.

### వ్యాపారంలో లాభాలు రావడం లేదు!

**చంద్రయ్య - కేశంపేట**

ప్రశ్న: **మిల్లులోను, వ్యాపారంలోను ఆర్థికంగా చాలా నష్టం వచ్చింది. మానసికంగా, శారీరకంగా ప్రశాంతత కరువయింది. ఇలా ఎందుకు జరుగుతోందో అర్థం కావటం లేదు. ప్రతి సంవత్సరం ఏదో ఒక రూపంలో నష్టం జరుగుతోంది. ఏ పని ప్రారంభించినా అది బాగా జరిగినట్లే అనిపించి, చివరకు నష్టంలోకి వచ్చి కష్టం మిగులుతోంది. మా ఇంట్లోగానీ, వెలుపలగానీ ఏమయినా లోపాలుంటే వాటికి పరిష్కార మార్గం చూపించి బాధలనుంచి విముక్తుల్ని చేయండి.**

**జవాబు:** మీరు పంపిన ప్లాన్‌లో దిక్కులు సరిగా పేర్కొనలేదు. మీరు రాసిన విషయానికి, ప్లానుకీ, దిక్కులకు సమన్వయం కుదరటం లేదు. కాబట్టి మరోసారి సరయిన వివరాలతో ప్లాను పంపించండి.

### ద్వారాల కొలతలు ఎలా ఉండాలి?

**విజయభాస్కర్ - తూర్పు గోదావరి జిల్లా**

ప్రశ్న: **మా ఇంటికి అన్ని ద్వారాలు మూడు అడుగుల వెడల్పుతో ఉన్నాయి. ప్రధాన ద్వారం మాత్రం మూడు అడుగుల, మూడు అంగుళాలు వున్నది.**

**జవాబు:** గృహంలో వున్న అన్ని ద్వారాలకంటే ప్రధాన ద్వారం పెద్దదిగా వుండాలన్న వాస్తు నియమం వున్నది. మీ ఇంట్లో అన్ని ద్వారాలు మూడు అడుగుల వెడల్పు వున్నాయి. ప్రధాన ద్వారం 3 అంగుళాలు ఎక్కువగా వుంది. అలాగే వుండాలి కూడా! అదేమి దోషం కాదు. కాబట్టి మీరు నిశ్చింతగా వుండవచ్చు. అయితే బాత్ రూమ్ తలుపులు మిగతా తలుపులకంటే తక్కువ వెడల్పు వుండాలన్న నియమం కూడా వున్నది. మిగతా అన్ని తలుపులకు బాత్ రూమ్ తలుపులు సమాన వెడల్పుగా వున్నాయా? తక్కువ వెడల్పు వున్నాయా? గమనించండి.

### పరిస్థితులు బాగుపడేదెలా?

**వెంకటరావు - బందరు**

ప్రశ్న: **ఒకప్పుడు మా ఇల్లు సుఖ సంతోషాలతో వుండేది. గత మూడు సంవత్సరాలనుండి నరకం అనుభవిస్తున్నాం. గోడపారున కాకుండా మధ్య గది గుమ్మం కిటికీ పారు మధ్య నుండి గోడ కట్టిన దగ్గర నుండి మా ఇంట్లో పరిస్థితులు ఏమి బాగాలేవు.**

**జవాబు:** ఉమ్మడి కప్పున్న గృహానికి ఉమ్మడి గోడతో వేరు చేస్తూ రెండు పోర్షన్లుగా విభజించి, రెండు కుటుంబాలు నివాసమున్నప్పుడు, తూర్పు లేదా ఉత్తరంవైపు నివసించేవాళ్లకు వాస్తు ప్రకారం మంచి ఫలితాలుంటాయి. పడమర లేదా దక్షిణం వైపు పోర్షన్‌లో నివసించేవాళ్లకు వాస్తు ప్రకారం అటువైపు నివసించే వాళ్లకంటే మంచి ఫలితాలుండవు. మీరు ప్లానులో చూపించిన ప్రకారం మీరు పడమర పోర్షన్‌లో వుంటున్నారు. తూర్పు ఆవరణలో ఇంటికీ ప్రహరీ గోడకూ మధ్య గోడ కట్టడం కూడా వాస్తు ప్రతికూలమే అవుతుంది. పదిహేను సంవత్సరాలనాటి వాస్తు పరిస్థితి ప్రస్తుతం ఆ ఇంటికుండదు. పరిసరాల్లో అనేక మార్పులు రావటం సహజం. కేవలం ఆ గోడ కట్టిన తరువాతే మీ పరిస్థితి ఇలా తయారయిందనుకోకూడదు. ఇంట్లో వాళ్లను ఒప్పించి ఆ గోడ తీసేయటం వలన కొంత ఊరట కలిగే అవకాశం ఉంది.

మీ ఇంటికి తూర్పు ముఖద్వారముంది. ఆ ద్వారంపైన 'షిరిడి సాయిబాబా' చిన్న పటాన్ని ప్రతిష్ఠించండి. తూర్పు ఈశాన్యంలో కూడా ఆయనదే చిన్న పటం పెట్టి రోజూ ఉదయం రెండు అగరొత్తులు వెలిగించి నిలబడి పూజ చేయండి. ఇంటి మార్పులు చేయలేని పరిస్థితుల్లో చిన్న చిన్న విధులు కూడా ఊరటనిస్తాయి. ■

వాస్తువిద్వాన్ డా॥ దంతూరి పండరినాథ్ పాఠకుల సమస్యలకు ఆదివారం 'వాస్తువార్త'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసిన చిరునామా: సాయిశ్రీ వాస్తు కన్సల్టెన్సీ, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-3

వాస్తువార్త

పూర్తి పేరు: ----------------------------------------

పుట్టినతేదీ:------------------- ఊరు: --------------

జన్మనక్షత్రం:----------తల్లిపేరు:---------------------

చిరునామా: --------------------------------------

------------------ ఫోన్: ------------------------

